"ఆ అజేయ ప్రాణవాహిని మాతృదేవిని పొగడరా!
పాటలన్నిటికంటె చక్కని పాట ఇదియే పాడరా!"

# ఇటలీ కథలు



వెల : రూపాయి

★

ఆగస్టు : 1949
ప్రతులు : 2000

ముఖచిత్రం :
నడిపల్లి శంకర్

ముద్రణ :
శ్రీ అజంతా ఆర్టు ప్రింటర్సు,
విజయవాడ.

ముఖపత్రం :
కవితిలక ప్రెస్,
విజయవాడ.

ప్రతులకు :
లీలా బుక్ డిపో
విజయవాడ, 2.

★

# ఇటలీ కథలు

- మాక్సిం గోర్కీ -

△

అనువాదం:

ప్రయాగ

▽

త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ
గవర్నర్ పేట: విజయవాడ, 2.

# ఇందులో



౨

# 1

# సమ్మె చేసారు!

---

నేపుల్స్ పట్టణంలో ట్రాం కార్మికులు సమ్మె చేసారు. వీధి పొడుగునా ఖాళీ ట్రాములు సోలుపులు సోలుపులుగా నిలబడి వున్నాయి. సంతోషంతో, స్వేచ్ఛగా మాట్లాడు కుంటూ, పాదరసంలా ప్రవహించే ట్రాం కండక్టర్ల డ్రైవర్ల జన సమూహం ఒకటి విక్టోరియా మైదానంలో గుమికూడింది. వారి తలలమీదుగా, పార్కు ఆవరణ అవతల జలయంత్రం ఎగజిమ్ముతున్న బిందు సందోహం, కత్తి అంచులాగా సూర్య కాంతికి మిలమిల లాడుతున్నది. పట్టణంలో అన్ని ప్రక్కలకూ ప్రయాణం చేయవలసిన జనమంతా – గుమాస్తాలు: పని వాళ్ళు: చిన్న చిన్న వ్యాపారస్థులు: కుట్టుమిషన్లవాళ్ళు: పెద్ద గుంపుగా, కార్మికులచుట్టూ వలయంగా నిలబడ్డారు; తమ తమ ప్రయాణాలకు విఘాతం కలిగించినందుకు కార్మి కుల్ని తిట్టిపోస్తున్నారు తిట్లూ ఎత్తిపొడుపులూ చాలక, నోటితో చెప్పలేనివి చేతి సంజ్ఞల్లోకూడా వ్యక్తం చేసుకుంటు న్నారు. అద్దూ అపూ లేకుండా నాలుకలతో మాట్లాడినట్టుగానే నేపుల్స్ పౌరులు చేతులతో కూడా మాట్లాడుతారు.

సముద్రతీరంనుంచి వచ్చిన చిరుగాలి కెరటానికి పార్కు లోని కొబ్బరిచెట్లు మెల్లగా తలలూపుతున్నాయి. దయ్యాపు

ఏనుగుల కాళ్ళలాగా [illegible]టి బోదెలు విపరీతంగా కన్పిస్తున్నాయి. అర్ధనగ్నంగా నేపుల్స్ వీధుల్లో తిరిగే పిల్లలు, పిచ్చుకల్లాగా తమ అరుపులతోనూ నవ్వులతోనూ ఆ వాతావరణమంతా నింపివేస్తున్నారు.

పురాతనపు చెక్కడంలాగా వున్న ఆ పట్టణం సూర్య కిరణాల్లో స్నానమాడి, కొత్త శక్తులతో పుంజుకుంటున్నట్లుగా వుంది. సముద్రపు నీలి కెరటాలు శిలాతీరంమీద విరుచుకు పడుతూ, మద్దెల మ్రోతల్లాగా, నగరంలోని కోలాహలాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి.

గుంపుల్లోంచి వస్తున్న కేకలకు అప్పుడప్పుడు సమాధానం చెబుతూ, సమ్మెదార్లంతా అయోమయంగా ఒక చోట పోగుపడ్డారు; కొంతమంది పార్కు ప్రహారీమీది కెక్కి జనంమీదినుంచి వీధిలోకి ఆదుర్దాగా చూస్తున్నారు. వేట కుక్కలచేత చుట్టుముట్టబడిన తోడేళ్ళ గుంపులాగా ఆ కార్మిక సమూహం ఆందోళనతో వున్నారు. కాని, ఆ యూనిఫారం లలోవున్న కార్మికులందరిలోనూ కన్పిస్తున్న పోరాటదీక్ష చుట్టూమూగిన జనాన్ని మరీ రెచ్చగొట్టింది. అయితే ఆ గుంపుల్లోకూడా వాటితాలూకు వేదాంతులు లేకపోలేదు.

“ఔనండీ, ఎంత పాటుపడ్డా, ఇంట్లో బిడ్డకు తిండి పెట్టుకోలేనివాడు ఏంచెయ్యాలంటారు?” అంటూ, సమ్మెదార్లమీద దాడిచేస్తున్న జనాన్ని క్రమంగా చల్లబరుస్తున్నారా వేదాంతులు.

చక్కగా అలంకరించుకున్న పోలీసు ఏజెంట్లు ప్రతి ఇద్దరి ముగ్గురి దగ్గిరా నిలబడి ఈ గుంపులు రహదారిని అడ్డ

గించకుండా చూస్తున్నారు. తిట్టేవాళ్ళ వైపునగానీ తిట్లు తినేవాళ్ళవైపునగానీ రాకుండా, తటస్థంగా వుంటూ, వాదోప వాదాలు మరీ తీవ్రతరమైనప్పుడుమాత్రం ఉభయపక్షాలనూ మందలిస్తున్నారు. ఏవన్నా గలాటాలు జరిగితే కలిగించు కోటానికి, ఎదురుగావున్న ఆఫ్రికా వీధిలో, ఒక రైఫిల్ దళం సిద్ధంగా వుంది. ఆ ముక్కోణాకారపు టోపీలతో, ఆ పొట్టికోట్లతో, అలాగుల మీద పైనుంచి కిందికి రక్తం కారుతున్నట్లున్న రెండు ఎర్రటి చారలతో - ఆదళం అశుభ సూచకంగా వుంది.

ఆ అరుపులూ పెడబొబ్బలూ అన్నీ ఒక్కసారి హఠా త్తుగా అణగిపోయాయి. జనంలో ఒక కొత్త ధోరణి - శాంత పడే ధోరణి వ్యాపించినట్లుంది. "సైన్యం! సైన్యం!" అని జనం అరుస్తుంటే, కార్మికులు మొహాలు బిగపట్టి, ఒకరికొకరు దగ్గిరిగా నిలబడుతున్నారు.

కార్మికుల్ని అవహేళనచేస్తూ విజయచిహ్నంగా వేసే ఈలలూ, కార్మికులను అభినందిస్తూ కొట్టేచప్పట్లూ ఒక్క సారిగా వినిపిస్తున్నాయి. ఈ హడావుడిలో ఒకనూలకాయుడు పాదుచుట్టూకట్టిన రాతిగట్టుకు కాళ్లు కొట్టుకుని చెట్టుగుబు రులో పడ్డాడు. కండక్టర్లూ డ్రైవర్లూ నెమ్మదిగా గుంపు ల్లోంచి దోవచేసుకుని, కార్ల దగ్గిరి కొచ్చారు; కొందరు కార్ల మీది కెక్కారు. గుంపులకేకలకు చెంపపెట్టుపెట్టినట్టు సమా ధానాలు చెబుతూ గుంపుల్లోంచి తోసుకొచ్చినప్పటికంటే, ఇప్పుడు వాళ్లు ఇంకా భీమణంగా వున్నారు. జనంలో గందర గోళంకూడా అణిగిపోయింది.

మృదునృత్యం చేస్తున్న అడుగులతో, లయయుక్తంగా నడుస్తున్న బూట్ల టకటకతో, యంత్రభాగల్లాగా వారి ఎడమ చేతులన్నీ ఒక క్రమంలో ఊగులాడుతూ, శాంతా లూసియాతీరంవైపునుంచి బూడిదరంగు దుస్తుల్లోవున్న సైనికులు వచ్చేసారు. వారు సీనారేకుతో తయారుచెయ్యబడ్డట్టుగా దుర్బలమైన యంత్రపు బొమ్మల్లాగా వున్నారు. వారిని ఒక ఆఫీసరు నడుపుతున్నాడు. అతను పొడుగ్గా అందంగా వున్నాడు. ఆ ముడి వడ్డ కనుబొమలూ, ఆపెదవులదగ్గిర సుడి తిరుగుతున్న ద్వేషమూ - అతనిలోని నిర్లక్ష్యాన్ని చెప్పక చెబుతున్నాయి. అతని పక్కనే ఒకలావుపాటి మనిషి ఎత్తు టోపీ పెట్టుకొని, ఒకే ఇదిగా వాగుతూ, చేతుల్తో ఏవేవో సంజ్ఞలు చేస్తూ, ఎగురుకుంటూ నడుస్తున్నాడు.

జనం కార్ల దగ్గిరనుంచి వెనక్కి వెళ్లిపోయారు. సైనికులు కార్ల మీద కార్మికులు నిలబడివున్న చోట్లకు జట్లుజట్లుగా చీలిపోతున్నారు.

ఆ ఎత్తుటోపీమనిషీ, ఇంకా గౌరవనీయులుగా కనపడే మరి కొందరు పెద్దమనుషులూ చేతులూపుతూ బిగ్గరగా అరుస్తున్నారు :

“ఇదే ఆఖరుసారి! ...ఇదే ఆఖరుమాట! ...వింటున్నారా?”

ఆఫీసరు విసుగ్గా మీసం దువ్వుకుంటూ తలవంచుకు నిలబడివున్నాడు. ఒకతను తన పొడుగాటిటోపీ ఊసులాడిస్తూ, ఏదో బిగ్గరగా అరుస్తూ, అతని దగ్గిరకు పరుగెత్తాడు. ఆఫీసరు తన కనుగొనల్లోంచి అతనివంక దృష్టిసారించి, నిటా

రుగా నిలబడి, ఎదురొమ్ము విరుచుకొని, సైనికులకు ఆజ్ఞాపించటం ఆరంభించాడు.

వెంటనే సైనికులు ఒక్కొక్క కారు మీదికి ఇద్దరు చొప్పున దూకటం, ఆ కార్లలో వున్న డ్రైవర్లు కండక్టర్లు ఒకరి వెనుక ఒకరు క్రిందికి దూకటం—జరిగాయి.

ఇది గుమిగూడిన జనానికి తమాషాగావుంది—కేకలు, ఈలలు, నవ్వులు! కాని, అంతలోనే సద్దుమణిగిపోయి, దట్టంగా విషాదం చుట్టుకున్న ముఖాలతో, భయం తొణికిసలాడే కళ్ళతో ఆ జనసమూహం నిశ్శబ్దభారంతో కార్ల దగ్గర నుంచి కదిలి, మొదటికారు వైపు నడుస్తున్నారు.

అక్కడ ఆ మొదటి కారు చక్రాలకు రెండడుగుల దూరంలో ఒక డ్రైవరు పట్టాలకు అడ్డంగా పడుకున్నాడు. టోపీలేకుండా గాలికి అల్లాడుతున్న ఆ బూడిదరంగు జుట్టూ, ఆ మొహంమీద మీసాలూ: సైనికుడి మొహంలాగా క్రోధం కక్కుతూ ఆ మొహం ఆకాశం వైపు చూస్తున్నది. జనం చుట్టూ మూగాక, అందులోంచి ఒక పిల్లవాడు, కోతిలాగా అతిచలాకీగావుండే పిల్లవాడొకడు వచ్చి, ఆ డ్రైవరు ప్రక్కనే పడుకున్నాడు. ఆ తర్వాత ఒకరొకరుగా వరసనే కార్మికులందరూ అలాగే పడుకుంటున్నారు.

జనంనుంచి గుసగుస వినిపిస్తున్నది. దేవతల్ని ప్రార్థిస్తున్న గొంతులూ, భీషణమైన శాపనార్థాలూ అక్కడక్కడా పైకి వినవస్తున్నాయి. స్త్రీలు అరుస్తున్నారు; గొణుక్కుంటున్నారు; వెర్రికేకలు పెడుతున్నారు. ఈ దృశ్యంలో ఒళ్ళు మరచిన వీధి పిల్లలు రబ్బరుబంతుల్లా అటూ ఇటూ ఎగిరిపడుతున్నారు.

ఆ ఎత్తుటోపీమనిషి గొంతు చించుకొని పిచ్చెక్కినట్లు ఏదో అరుస్తున్నాడు. అతనివంక చూసి ఆఫీసరు బుజా లెగరేసి, వూరుకున్నాడు. తన సైనికులు కార్మికుల దగ్గిర్నుంచి కార్లు స్వాధీనం చేసుకున్నారు; కాని, కార్మికులతో పోరాడటానికి తనకు ఆజ్ఞలు లేవు!

అప్పుడు ఆ ఎత్తుటోపీవాడు కొందరు అధికారులతో కలిసి రైఫిల్‌దళం దగ్గిర కెళ్ళాడు - వెంటనే రైఫిల్‌దళం ముందు కొచ్చింది. పట్టాలమీద పడుకున్నవాళ్ళను తోలగించటానికై, రైఫిల్‌దళం, వాళ్లమీదికి వంగింది.

అక్కడ ఒక చిన్న గందరగోళం జరగటంతో అంత వరకూ ప్రేక్షకులుగా ఉన్న జనమంతా ఉరూపోతూ, కేకలు వేస్తూ, పట్టాలమీదికి ఎగబడ్డారు. ఒక సూటువేసుకున్న పెద్దమనిషి తన టోపీని గాలిలోకి విసిరివేస్తూ, పట్టాలమీది కొచ్చేసి, చినరి కార్మికుడి పక్కన తానుకూడా పడుకొని, అతనికి చెవులో ధైర్యం చెబుతూ, బుజం తట్టుతున్నాడు.

ఒకరివెంట ఒకరు జనమంతా, ఇక తమ కాళ్లు పని చేయనట్టుగా, ఆ పట్టాలమీద పడిపోతున్నారు - ఉత్సాహంతో కేకలతో ఆజనం, అంతకుముందు, రెండు నిమిషాల ముందుకూడా అక్కడ లేని జనం, నవ్వుకుంటూ ఒకర ముఖాలొకరు చూసుకుంటూ ఆ నేలమీద పడుకున్నారు; తలూపుతూ ఆ ఎత్తుటోపీఅతనికేదో చెబుతున్న ఆఫీసరు వంక చూసి కేకలు పెడుతున్నారు.

ఇంకా ఇంకా జనం పట్టాలమీద పడుకుంటున్నారు. స్త్రీలు తమ చేతుల్లోవున్న పొట్లాలు బుట్టలూ కింద వదిలేసి

ఆ పట్టాలమీద పడిపోతున్నారు. చిన్నపిల్లలు — వణకు తున్న కుక్కపిల్లల్లాగా - నవ్వుతో మెలితిరిగిపోతూ, పడుకుం టున్నారు. చక్కని దుస్తుల్లోవున్న వారనేతలు ఆదుమ్ములో దొర్లాడుతున్నారు.

మొదటికారులో నిలబడివున్న సైనికులు కింద గుట్టగా పడిన శరీరాలను చూసి పట్టరాని నవ్వుతో ఆ కడ్డీలు పట్టుకు వేళ్లాడుతున్నారు; ముందుకువంగి అద్భుతంగా చూస్తు న్నారు. ఇప్పుడు వాళ్ళు యంత్రపు బొమ్మల్లా కనిపించటం లేదు.......

...... అరగంట అనంతరం మోతపెడుతూ, నేపుల్స్ వీధుల్లో ట్రాంకార్లు పరుగెత్తటం ప్రారంభించాయి. ఉత్సా హం ఉప్పొంగుతూ ఆకారుమీద విజేతలైన డ్రైవర్లూ, కండక్టర్లూ కింద విజేతలైన ప్రజానీకమూ పరస్పరం అభినం దించుకుంటున్నారు.

లోపల ప్రయాణీకులు కనుసైగలు చేస్తూ, చిరు నవ్వులు నవ్వుతూ, సరదాగా గుసగుసలాడుతూ, కార్మికులకు జయసూచకంగా ఎర్రటి పచ్చటి కాగితంముక్కలు అంది స్తున్నారు.

# 2

# సుస్వాగతం:

---

జెనోవా స్టేషన్ ఎదుట మైదానం జనంతో క్రిక్కిరుస్తున్నది. అందులో చాలామంది కార్మికులే. కాని, మంచి తిండీ గుడ్డా వున్నవాళ్లు కూడా చాలామంది వున్నారు. జనానికి ముంగల టౌన్ కౌన్సిల్ సభ్యులు నిలబడివున్నారు. వారి శిరస్సుల మీదుగా నగిషీ కుట్టుపనితో, ఓ పెద్ద సిల్కు-జెండా, జెనోవా నగరపు జెండా ఎగురుతున్నది. దానివెనుక వివిధవర్ణాలతో కూడిన వివిధకార్మికసంస్థల తాలూకు జెండా లెగురుతున్నాయి. బంగారంలా మెరిసే ఆ జెండాల అంచులూ, జెండాల తాళ్ళూ ముళ్ళూ మిలమిల లాడుతున్నాయి. జెండాకర్రల చివర్లు మెరిసిపోతున్నాయి. గాలిలో అల్లాగా కదలాడుతున్న ఆ సిల్కు-జెండాలు రెపరెప ధ్వనులు చేస్తున్నాయి. కోలాహలంగా వున్న జనసందోహంనుంచి, లోగొంతులో పాడుతున్న బృందగానంలాంటి కలకలం వినిపిస్తున్నది.

ఎదురుగా ఆపైన ఎత్తాటి దిమ్మమీద కొలంబస్ విగ్రహం నిలబడివుంది. తన నమ్మకాలకోసం అన్నిబాధలనుభవించిన ఆ స్వాప్నికుడు, తాను నమ్మాడు కనుకనే జయించిన ఆ కార్యశూరుడు-ఇవాళ కూడా ప్రజలవంక క్రిందికి చూస్తున్నాడు; ఆ పాలరాతి పెదవులు ఇంకా ప్రబోధిస్తున్నట్టుగానే వున్నాయి :

"ఎవరు నమ్ముతారో వాళ్లే జయించగలరు" అని!

ఆ దిమ్మచుట్టూ వాద్యగాండ్రు తమ జంత్ర పరికరాలు పెట్టుకున్నారు. ఆ ఇత్తడి పనిముట్లు, ఆ లేత ఎండలో, బంగారంలా మెరిసిపోతున్నాయి.

వెనకవైపున, అర్ధవలయాకారంగా వున్న స్టేషన్ భవనం యొక్క పాలరాతి వసారా కప్పు ముందుకు వంగి, ఎదురుగా ఆ వేచివున్న జనాన్ని కౌగిలించుకో గోరుతున్నట్టుగా కనిపిస్తున్నది. అటు రేవులోంచి – పొగ ఓడల బలమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలూ, కవ్వంలాగా నీళ్ళల్లో తిరిగే ప్రొపెల్లర్ల గిలకొట్టేరకం ధ్వనులూ, గొలుసుల గలగలలూ, ఈలలూ, కేకలూ–ఒక్కసారిగా వినిపిస్తున్నాయి. సూర్యుడు నిప్పులు చెరుగుతున్నప్పటికీ మైదానమంతా నిశ్శబ్దంగానేవుంది. మేడలమీద బాల్కనీలలోనూ, కిటికీలలోనూ చేతులనిండా పూలగుత్తులు పట్టుకొని స్త్రీలు నిలబడివున్నారు. వారిప్రక్కనే నిలబడ్డ బిడ్డలు పండగ ముస్తాబులో విచ్చుకున్న పద్మాల్లాగా కళకళలాడుతున్నారు.

కూతవేస్తూ, రైలు, స్టేషన్‌లో ప్రవేశించేసరికి జనంలో ఎక్కడలేని సంచలనం వచ్చేసింది. ఎగరేసిన టోపీలు ఆకాశం నిండా నల్లటిపిట్టల్లాగా ఎగురుతున్నాయి. వాద్యగాండ్రు తమ తాషామరపాలు తయారుచేసుకుంటున్నారు. పెద్దలు తమ దుస్తుల్ని సవరించుకుంటూ, గబగబా ముందుకు నడిచి, జనం వంక తిరిగి, ఉద్రేకంతో ఏదో ఉపన్యసిస్తూ, కుడికీ ఎడమకూ చేతులు తిప్పుతున్నారు.

క్రమంగా జనం రెండుపాయలుగా చీలి మధ్యనుంచి వీధికి త్రోవ వదిలేసి, అటూ ఇటూ నిలబడ్డారు.

"వీళ్లు ఎవరికోసం వచ్చారు ?"

"పార్మానుంచి వస్తున్న బిడ్డలకోసం !"

పార్మాలో ఒక సమ్మె జరుగుతున్నది. యజమానులు లొంగిరాకపోవటంవల్ల కార్మికులు అనేక కష్టనిష్ఠురాలను ఎదుర్కోవలసి వస్తున్నది. చివరకు బిడ్డలకు కూడా ఆకలి బాధ తప్పలేదు. ఈపరిస్థితుల్లో ఇక లాభంలేదని పార్మా కార్మికులు తమ బిడ్డలను తమ జినోవా సోదరులవద్దకు పంపుతున్నారు.

స్టేషన్ ఆవరణలోంచి చిన్నపిల్లలు ఊరేగింపుగా బారులుతీర్చి చెట్టాపట్టాలు పట్టుకొని, ఐదేసిమంది ఒక్కొక్క వరసగా వస్తున్నారు. ఆ చిరిగిపోయిన మురికిపాతల్లో పాపం, ఆపిల్లలు ఒకరకం చిన్నచిన్న వింత జంతువుల్లాగా వున్నారు. శరీరమంతటా దుమ్ముకొట్టుకొని, అలసిపోయి, వాళ్ల మొహాలు భయంకరంగా వున్నప్పటికీ, వాళ్ళ కళ్ళు మిలమిల్లాడు తున్నాయి. వాద్యగాండ్రు మహోత్సాహంతో 'గారిబాల్డీ' విజయగీతం వాయించేసరికి, ఆకలితో శోకంతో వడలిపోయిన ఆ లేతమొహాల్లో ఆనందం చిరునవ్వులా వెల్లివిరిసింది.

ఈ భావిపౌరులకు జినోవా జనసమూహం దిక్కులు పిక్కటిల్లే నినాదాలతో స్వాగతమిచ్చింది; అన్ని జెండాలూ వారి ఎదుట గౌరవంతో శిరస్సులు వంచి వారిని స్వీకరించాయి. దిగ్భ్రమలో ముంచెత్తుతూ జంత్రవాద్యాలన్నీ ఒక్కసారిగా జయగీతం ఘోరుకొలిపాయి. ఈ అట్టహాసానికి

పసిపిల్లలు పాపం ఒక క్షణం తటపటాయించారు. కాని అంతలోనే రొమ్ము విరుచుకొని, తాము చాలా ఎత్తు పెరిగి నట్టు కనిపిస్తూ, ఒక సమూహంగా నిలబడ్డారు.

వారి వంధగొంతులోనుంచి ఒకే నినాదం మోగు తున్నది: "ఇటలీ వర్ధిల్లాలి!"

"పార్మాబిడ్డలు వర్ధిల్లాలి!" అని ప్రతిధ్వనిస్తూ జన సమూహం వారి చుట్టూ చేరుకుంటున్నారు.

"గారిబాల్డీ వర్ధిల్లాలి!" అని పిల్లలందరూ పెద్ద పెట్టున నినాదాలు చేస్తూ జనసమూహంలో కలిసిపోయారు.

హోటళ్ళ, కిటికీల్లోంచీ, ఇంటి కప్పులమీదినుంచీ - తెల్లటి పిట్టల్లాగా జేబురుమాళ్ళు రెక్కలు విప్పుకుంటున్నాయి. చిరువర్షంలా పూలు కురుస్తున్నాయి; క్రిందనడిచే జనసమూ హాలను వేయినోళ్ళ అభినందిస్తూ చేస్తున్న నినాదాలు క్రిందికి దూకుతున్నాయి.

ఆ మహోత్సవకోలాహలంలో ప్రతివస్తువూ కొత్త జీవంతో తొణుకాడుతున్నది. మూంగరాళ్ళుకూడా వెండి జలతారు పూతలు పూసినట్టు తళతళలాడిపోతున్నాయి.

ఆ గాలి కెరటాలలో తేలియాడుతున్న జెండాలూ; గాలిలోకి రివ్వున ఎగురుతున్న పూలూ, టోపీలూ, జనసమూ హం తలల మీదినుంచి నిక్కిచూస్తున్న ఆ పాపల చిరు శిరస్సులూ; అభినందించటానికై ఎత్తి పూలను పట్టుకో బోతున్న దీక్షాబద్ధమైన వారి లేత చేతులూ; దిక్కులు ప్రతి ధ్వనిస్తున్న ఆ నిరంతరనినాదాలూ - ఒక అద్భుతనృత్యం చేస్తున్నట్లున్నాయి.

"సోషలిజం వర్ధిల్లాలి!"

"ఇటలీ వర్ధిల్లాలి!"

పిల్లలందరినీ పెద్దవాళ్లు ఎత్తుకున్నారు. కొందరు బుజాల మీద కూర్చోబెట్టుకున్నారు. మరి కొందరు మీసాలా గడ్డాలావాళ్లు పిల్లల్ని తమ ఎదురొమ్ముల కదుముకుంటున్నారు. ఈ కేకల్లోనూ, సంతోషంలోనూ, 'గారిబాల్డీ' విజయసంగీతం వినరావటమే కష్టంగావుంది.

స్త్రీలు జనంలోకి వెళ్లి ఇంకా మిగిలివున్న పిల్లల్ని ఏరి తెచ్చుకుంటున్నారు. ఎవరెవరికి ఎంతెంతమంది పిల్లలు కావాలో కూడబలుక్కుంటున్నారు:

"అనిటా! నువ్విద్దర్ని తీసుకుంటావు కామా?"

"ఔను, మరినువ్వో?"

"మన కుంటి మార్గరెట్‌కు ఒక బిడ్డ కావాలి...మరచిపోకేం?"

వాతావరణమంతా సంతోషసంభ్రమాలతో సంచలిస్తున్నది. అన్నివైపులా కొత్తకాంతితో మిలమిలలాడే ముఖాలు, కరుణతో ఆర్ద్రమైన కన్నులు! అప్పుడే ఆ బిడ్డలు రొట్టెముక్కలు నములుతున్నారు.

ఒక వృద్ధుడు మునివంటితో చుట్టకొరుకుతూ, ఆ కొంగ ముక్కు ముందుకు పెట్టి, ఆశ్చర్యంగా అంటున్నాడు:

"ఇలా జరుగుతుందని మా రోజుల్లో మేమెవ్వరం అనుకోలేదు!"

"చూడు, ఎంత తేలిగ్గావుందో!"

"ఔను తేలికే! తెలివైన పనికూడా!"

ఆ వృద్ధుడు చుట్ట నోట్లోంచి తీసి, అలా దాని వంక చూసి, బూడిద విదిలిస్తూ, నిట్టూర్చాడు. తర్వాత తన పక్కనే వున్న ఇద్దరు పిల్లల్ని-బహుశా అన్నదమ్ములే కావచ్చు-చూసి, ముఖానికో వింత గాంభీర్యం తెచ్చుకొన్నాడు. ఆ పిల్లలు తన వంక ఆశ్చర్యంగా చూస్తుంటే, టోపీ కళ్ళమీదికి అడ్డం లాక్కొని, దాగుడుమూతలలోలాగా 'దొంగల్ని' పట్టుకోటానికి చేతులు చాపి వెతుకుతున్నాడు. వాళ్ళు భయంగా వెనక్కు తగ్గటం చూసి, నేలమీద చతికలబడి, కోడిపుంజులాగా కూయటం మొదలెట్టాడు. వెంటనే ఆ బిడ్డలు విరగబడి నవ్వుతూ వెర్రిగంతులేస్తున్నారు. అంతటితో ఆ వృద్ధుడు లేచి నిలబడి, టోపీ సరిచేసుకొని, తననుంచి వాళ్ళకు కావలసిందంతా ఇచ్చేసినట్లు సంతృప్తితో తూలుతూ వెళ్ళిపోయాడు.

మంత్రగత్తెలా కనిపించే ఓ గూని ముసలమ్మ, తన పెద్దగడ్డం చివర అక్కడక్కడా తీగెల్లాగా వేళ్ళాడుతున్న తెల్లటి వెండ్రుకలతో, కొలంబస్ విగ్రహం ఎదట నిలబడి, ఆమాసిన చెరగుతో ఎర్రబారిన కళ్ళు తుడుచుకుంటూ; ఏడుస్తున్నది. దుఃఖంతో, వికారంగా ... ఆ తీర్థ ప్రజలోంచి విడివడ్డట్లు ఒంటరిగా—ఆమె విపరీతంగా కనిపిస్తున్నది ...

ఏడేళ్ళ పిల్లవాణ్ణి చేతబట్టుకొని ఒక జినోవా యువతి పెళ్ళి నడకలు నడుస్తున్నది. కర్ర చెప్పులు తొడుక్కొని, ఆకుర్రవాడు – నల్లటి జుట్టూ, వాడూ – నెత్తిమీద టోపీ

పెద్దదై భుజాలమీద పడుతున్నా, దాన్ని వదలకుండా అది కళ్ళమీదినుంచి పైకి పొయ్యేటట్టు తల విదిలించుకుంటూ, ఆమెతో కూడా నడుస్తున్నాడు. మళ్లీ ఆటోపీ కళ్ళమీదికి పడుతూనే వుంది. వాడు విదిలించుకుంటూనే వున్నాడు. ఆఖరకి ఆమె దాన్ని లాక్కొని, గాలిలోకి విసిరికొట్టేసి, నవ్వుతూ పాడుతూ వాణ్ణి బులిపించటంతో వాడి మోహాన చిరునవ్వు తొలకరించింది. అంతలో తల వెనక్కి తిప్పి, టోపీ కోసం పరుగెత్తాడు. కనుమరుగయేదాకా ఆ యిద్దరూ అలానే ఆడుకుంటూ వెళ్లిపోయారు. తోలు ముప్పటి కప్పుకొని, దిసిచేతుల్లో ఒక చక్కని ఆరేళ్ళ పిల్లను ఎత్తుకొని, నడుస్తున్న ఓపొడుగాటివాడు – తన పక్కనే ఒక అబ్బాయిని నడిపించుకుపోతున్న మరొకామెను చూసి – అంటున్నాడు.

"చూడు! ఇలాంటి అలవాటు కనుక మనలో నాటుకున్నదా అంటే...ఇక మనలోంచి సారం పిండటం ఎవ్వరి తరం కాదు!"

విజయోన్మాదంతో నవ్వుతూ ఆ బిడ్డను నీలాకాశంలోకి ఎగరేస్తూ "పార్మా వర్ధిల్లాలి!" అని కేకలు వేస్తూ, నడుస్తున్నాడు.

బిడ్డల్ని ఎత్తుకొని కొంతమందీ, కూడా నడిపించుకొని కొంతమందీ...అంతా క్రమంగా వెళ్ళిపోయారు. ఆ సముద్రంలో నలిగిపోయిన పూలూ, తినిపారేసిన పొట్లాల కాగితాలూ, తమాషాగా మెరుస్తున్న కంపెనీల సైన్‌బోర్డులూ, వీటన్నిటికీ పైగా ఎత్తుగా ఆ దిమ్మమీద, నూత్న ప్రపంచాన్ని

అన్వేషించిన ఆ మహనీయుడి విగ్రహం... ఇవే ఇంకా అక్కడ మిగిలాయి.

ఒక కొత్త జీవితంవైపు పురోగమిస్తున్న జనావళి నినాదాలు, కోటి మద్దెలల మోతలై, ఇంకా పురవీధుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

---

# 3

# మానవుడు జయించాడు!

---

చుట్టూ, మంచు కిరీటాలు పెట్టుకున్న ఉన్నత పర్వతాలూ; ఆ కొండలనుంచి నీటి అంచువరకూ వ్యాపించి వంపులు వంపులుగా దిగివస్తున్న నల్లటి తోటల గుబుర్లూ; మధ్య ఆ ప్రశాంతమైన నీలి సరస్సూ-పంచదారతో కట్టినట్టు తెల్లగా వున్న ఇళ్ళు ఆ నీళ్ళలోకి తొంగిచూస్తూ – ఆ వాతావరణంలో ఆ ప్రశాంతి, శిశువు మధుర నిద్రలాగా, వుంది.

అది ఉదయం. కొండల మీదినుంచి పూలవాసనలు మధురంగా వీస్తున్నాయి. అప్పుడే పొద్దుపొడిచింది; ఇంకా చెట్ల ఆకులమీదా గడ్డి పరకలమీదా మంచుబొట్లు మెరుస్తూనే వున్నాయి. ఆ ప్రశాంత పర్వతకంఠంలోకి చొచ్చుకొని వచ్చి పరచుకున్న 'రిబ్బన్' (పీలిక) లాగా వుంది రోడ్డు; అది కంకరరోడ్డే కాని, ముట్టుకుంటే మెత్తగా సిల్కులాగా ఉండే టట్లనిపిస్తున్నది.

అక్కడ ఓరాతిగుట్ట ప్రక్కన ఒక కార్మికుడు, పేడ పురుగులాగా, నల్లగా, కూర్చొని వున్నాడు. అతని మొహంలో దయా, ధైర్యం వ్యక్తమవుతున్నాయి. అతని రొమ్ము మీద ఏదో 'మెడల్' కూడా ఒకటుంది.

ఆ దండలు తిరిగిన చేతులతో 'రెడ్డిగం' వేసి కూర్చొని

తలెత్తి, ప్రక్కనే చెట్టుక్రింద నిల్చున్న బాటసారి మొహంలోకి చూస్తూ, అతను తనకథ చెప్పటం ప్రారంభించాడు :

"ఈ 'మెడ'లా? అయ్యా, ఇది సింప్లాన్ కొండ తొలిచినప్పుడు కష్టపడి సంపాదించాను." అని చెప్పి, తల వంచి, తన రొమ్ముమీద మెరుస్తున్న మెడల్ వంక చూస్తూ, చిరునవ్వు నవ్వాడు.

"నిజమే. అసలు పని అనేది నరాల్లోకి ఇంకిపోయి, మనం ఆపనిని ప్రేమించటం నేర్చుకున్నదాకా, ప్రతిపనీ కష్టంగానే వుంటుంది. కాని ఆతర్వాత మాత్రం అదే మనల్ని ఉత్తేజపరుస్తుంది; తేలికై పోతుందికూడా. అయితే, అంత తేలిక కాదనుకో...!"

అతను అయోమయంగా తలవూపి, ఎండను చూసి నవ్వుతూ, అంతలో తెలివితెచ్చుకున్నట్టుగా చేయి విదిలించాడు; అతని నల్లటికళ్లు ఒక్కసారి మెరిసాయి.

"పని, ఒక్కొక్కప్పుడు కొంచెం భయంకరంగాకూడా వుంటుంది. అసలు ఈ భూదేవికూడా ఏదో ఒకటి అనుకోవాలి గదా! నువ్వు చెప్పు- కొండ పక్కనించి పెద్ద గుహ కొట్టుకొని తొలుచుకుంటూ మేము భూగర్భంలోకి పోయినప్పుడు అక్కడ భూదేవి మామీద నిప్పులు చెరిగింది. ఆ వెచ్చటి ఉక్కలో గుండెలు కుంగిపోతూ, తలలు బరువెక్కినట్లై, ఎముకలు కొరుకుతున్నట్లనిపించింది. చాలామందికి ఇలాగే అనిపించింది. ఆ తరువాత, భూదేవి మామీద రాళ్లవర్షం కురిపించింది. అది కాక, వేడినీటి పిచికారీలు చిమ్మించి కొట్టటం, మరీ భయం

కరం! అప్పుడప్పుడు ఆ నీటిమీద ఓకిరణం పడితే సరి, అది ఎర్రగా మెరిసేది. వెంటనే 'మనం భూదేవిని గాయపరిచాం; ఇంక ఆమె మనల్నందర్నీ తన రక్తంలో ముంచెత్తి, దహిం, చేస్తుం!' దని మాకాన్న చెప్పేవాడు. నిజానికి అది వట్టి ఊహే అనుకోండి. కాని ఆ చీకటి గుయ్యారంలో ఒక వైపు నుంచి వేడినీళ్ళు చిమ్ముంచి కొడుతూవుంటే, రెండో వైపున మేము ఉక్కు పనిముట్లతో కొండరాళ్ళు తొలుస్తూవున్నప్పుడు అప్పుడు-ఏం చెప్పినా నిజంగానే వుంటుంది. అక్కడ ఎంత అద్భుతంగా వుంటుందనుకున్నావు? అంత ఎత్తున మేఘాలను తగులుతూ ఆ కొండ, దాని కడుపులోకి తొలుచుకుపోతూ మేము - ఆ కొండతో పోల్చుకున్నప్పుడు మేము ఎంత అల్ప ప్రాణులంగా అనిపించేదని!......

ఒకసారి చూస్తేనేగాని నేను చెప్పేదేమిటో నీకు అర్థం కాదు. ఆ కొండ అవులించటానికి నోరు తెరిచినట్టుగా కనిపించే ఆ సొరంగం, మేము తొలిచిన సొరంగం-నీవు చూసి వుండవలసింది. మేము పొద్దుటిపూట ఆ సొరంగంలోనుంచి భూగర్భంలోకి పోతున్నప్పుడు సూర్యుడు మమ్మల్ని దీనంగా వెనకనించి చూస్తుండేవాడు. నువ్వు ఆ గుహాముఖం ఒకసారి చూడవలసింది - ఎక్కడో లోపల ధ్వనులన్నీ వినిపించేవి; లోపల జరిగిన పేలుడు మోతలన్నీ, పిచ్చివాడి వికటాట్టహాసంలాగా, ప్రతిధ్వనించేవి."

తన అరచేతు లొకసారి పరీక్షగా చూసుకున్నాడు. తన నీలవుకోటుకున్న ఉక్కుస్ప్రింగు మీదికి చెయ్యిపోనిచ్చి, మెతుగా నిట్టూర్చి, మళ్ళీ సగర్వంగా ప్రారంభించాడు :

"పని చెయ్యటమెలాగో మనుషులకు తెలుసు! మనిషి భౌతికంగా అంత అల్పప్రాణి అయినప్పటికీ, ఒక పని చెయ్యబూనుకున్నప్పుడు అజేయుడు కాగలడు. ఈ మాటమాత్రం మరచిపోకు! ఈ చిన్న మనిషి, చెయ్యదలచుకున్నదల్లా, చెయ్యగలిగే రోజులు వస్తాయి. ఈ మాట చెబితే, నా తండ్రి మొదట్లో నమ్మేవాడు కాదు.

"'ఒక దేశంనుంచి మరో దేశానికి కొండలోంచి సొరంగం చేసుకుపోవటమంటే ఏమిటి? ఈ కొండలతో గోడలుపెట్టి భూభాగాన్ని విభజించిన భగవంతుణ్ణి ప్రతిఘటించటమన్నమాట! ఇందుకు మెడోనా మనల్ని శపిస్తుంది!' అనేవాడు. కాని ఆయనది పొరపాటు. తనను ప్రేమించే వారినెవ్వరిని మెడోనా ఎప్పుడూ త్రోసిపుచ్చదు. కాని క్రమంగా ఆయన కూడా తాను కొండకంటె బలవంతుణ్ణనీ అధికుణ్ణనీ అనుకోటం మొదలెట్టాడు. తర్వాత తర్వాత నేను నీకు చెప్పినట్టుగానే ఆయనా ఆలోచించేవాడు. అయితే అంతకుముందు మేమందరం కూర్చున్నప్పుడు, ఆయన, చేతిలో ఒక సారాయిబుడ్డి పట్టుకొని, భగవంతుణ్ణి గురించి మాకు ఉపన్యసించిన రోజులనేకం వున్నాయి.

"ఆయన దైవభీతి కలవాడు కనుక మాటకు ముందు 'ఓ దేవుడి బిడ్డలారా!' అని సంబోధించేవాడు. 'మీరు ఈ రకంగా భూదేవితో పోరాడలేరు. మీరు కలిగించిన గాయాలన్నింటికీ ఆమె ప్రతీకారం చేసి తీరుతుంది. మళ్లీ యథాప్రకారం అజేయంగా వుండిపోతుంది. చూస్తారు గదా: మనం ఆపర్వతగర్భంలోకి సూటిగా సొరంగంకొట్టుకు

పోవాలి. మనం అపర్వతగర్భం తాకీతాకటంతోటే అందరం నిప్పులగుణ్ణంలో పడిపోతాం. భూగర్భమంతా నిప్పులకుంపటి అని అందరికీ తెలుసు! నేలదున్ని, ప్రకృతి పునఃప్రసవానికి తోడ్పడటమంటే - అది మానవుడి విధి. కాని, మనం ఎప్పుడూ దానిరూపు మార్చటానికి గానీ చెడగొట్టటానికిగానీ సాహసించకూడదు. చూడండి, మనం కొండలోకి తొలుచుకు పోయినకొద్దీ గాలివేడి ఎక్కువవుతున్నది; ఊపిరిపీల్చటం కష్టమవుతున్నది'... అనేవాడు.”

చేత్తో మీసంతిప్పుతూ, మెల్లగా నవ్వి, అతను మళ్లీ మొదలు పెట్టాడు.

“అలా ఆయనొక్కడే కాదు, చాలామంది అనుకునే వాళ్లు. అది నిజంకూడా. సొరంగంలోపలికి పోయినకొద్దీ ఉక్క ఎక్కువయ్యేది. మాలో చాలామందికి జబ్బులుచేసాయి; కొంతమంది చనిపోయారు కూడా. వేడినీటి బుగ్గలు మరీ భయంకరంగా ప్రవహించేవి. పెద్దపెద్ద అండలు విరిగి పడుతుండేవి. రాత్రిళ్లు బారకాసుల్లో చాలామంది సంధించినట్లు పలవరిస్తుండేవాళ్లు. ఏదో పెద్ద భయోత్పాతం తోచి, పడుకున్నవాళ్లలా అలా లేచి కూచొని, మూలుగుతుండే వాళ్లు-లుగానో నుంచి వచ్చిన ఇద్దరు కార్మికులకు పిచ్చెత్తింది కూడా.

“ 'నేను చెప్పలేదా? మీరు ప్రకృతిని జయించలేరు!' అని భయంతో చూస్తూ, నాన్న చెప్పేవాడు. అప్పటికే ఆయనకు దగ్గు బాగా ఎక్కువై పోయింది.

“చిట్టచివరకు మళ్లీ లేవకుండా మంచం పట్టాడు. నా

తండ్రి, వృద్ధకాయుడైన అవృద్ధుడు, తన శక్తి తెలిసినవాడి లాగా, దిగులు పడకుండా నిబ్బరంగా, మూడు వారాలు మృత్యువును ప్రతిఘటించి, పోరాడాడు.

"ఒక రాత్రిపూట ఆయన నన్ను దగ్గిరికి పిలిచి, 'పావ్‌లో, నాపని అయిపోయింది. నీగురించి నువ్వెన్నా శ్రద్ధ తీసుకొని, ఇంటికి పో! మెషోనా తల్లి నిన్ను కనిపెట్టి వుంటుంది గాక!' అన్నాడు. తర్వాత చాలాసేపు అలా నిశ్శబ్దంగా కళ్లు మూసుకుపడుకొని, బరువుగా ఊపిరితీస్తున్నాడు."

అతను లేచి నిలబడి, ఆ పర్వతాలవంక చూస్తూ, నరాలు పెటపెటలాడేట్టు వెన్నువిరుచుకుని, మళ్ళీ చెబుతున్నాడు:

"తర్వాత నాచెయ్యి పట్టుకొని, నన్ను దగ్గరకు తీసుకుంటూ - సత్యమే దైవం - అని, ఇలా అన్నాడు: 'నీకు తెలుసునా? బిడ్డా, పావ్‌లో! ఎలాగైనా ఆ పని పూర్తి అవుతుందని నా ఉద్దేశం. ఇటునుంచి మనమూ, అటునుంచి తొలుచుకొస్తున్నవాళ్లూ - అందరం పర్వతగర్భంలో కలుసుకుంటాం! నీకు నమ్మకమేగదా, పావ్‌లో?'

"నాకు నమ్మకమే.

"'సరే బిడ్డా, అది బాగానే వుంది. ఎవడికైనా తాను చేసే పనిలో విశ్వాసం వుండాలి. విజయంమీద విశ్వాసం వుండాలి. మెషోనాతల్లి ప్రార్థనల్ని ఆలకించి, మంచి పనులన్నింటికీ తోడ్పడే భగవంతుణ్ణి నమ్ముకోవాలి. పావ్‌లో, నువ్వు నాకు ఒక్క కోరిక తీర్చు. మనం అనుకున్నట్టే జరిగి, పర్వత గర్భంలో అంతా కలుసుకుంటే నువ్వు నాకోసం ఒక్క

పని చెయ్యి. నా సమాధి దగ్గిరికి వచ్చి – తండ్రీ, జయించాం! అని చెప్పు. చాలు, నాకు తెలుస్తుంది !'

"మంచిదే. అలా చేస్తానని నేను మాట ఇచ్చాను. ఆ తర్వాత ఆయన అయిదు రోజులకు మరణించాడు. ఇంకా కొన్నాళ్ళకు చనిపోతాడనగా మమ్మల్ని తక్కిన పనివాళ్ళనూ పిలిచి, తాను సొరంగంలో పనిచేసినచోటనే తన శవాన్ని సమాధి చెయ్యాలని గట్టిగా పట్టుపట్టాడు. కాని అదంతా పలవరింపు కావచ్చు.

"నా తండ్రి చనిపోయిన తర్వాత పదమూడు వారాలకు ఆ పర్వత గర్భంలో అవతలి నుంచి తొలుచుకొస్తున్న వాళ్ళూ మేమూ కలుసుకున్నాం. ఆరోజు చాలా అద్భుతంగా వుంది. మమ్మల్ని ఆ భూగర్భంలో కలుసుకో వచ్చేవాళ్ళు అవతలి వైపున చేస్తున్న ప్రేలుడు ధ్వనులు వినపడుతున్నప్పుడు మహా భారమైన ఆ కొండ అడుగున ఆ చిమ్మచీకటిలో – ఎంత భయంగావుంది! ఈ అల్పప్రాణులందర్నీ అది ఒక్కసారిగా తొక్కిపారెయ్యగలదు.

"రెండో ప్రక్కనుంచి వచ్చే మ్రోతలు చాలా రోజుల ముందు నుంచీ వినిపించసాగాయి. మొదట్లో ఓటి మ్రోతల్లా వినిపించేవి, నానాటికీ స్పష్టంగా స్ఫుటంగా వినిపించాయి. క్రమంగా విజేతలకు లాగా మాకు విజయోన్మాదం ఆవహించింది. విసుగూ వేసటా లేకుండా, రాక్షసుల్లాగ రాత్రింపగళ్ళూ పనిచెయ్యటం ప్రారంభించాం. ఆహా! అది ఎంత సుదినం. మబ్బు తెరతీసిన రోజున నృత్యం చేసినట్లుంది. ఆ రోజున మా అందరిలోనూ–పసిపాపలలో లాగా–ఎంత మంచి

తనం, ఎంత దయా వెల్లి విరిసాయి! నువ్వు నిజంగా ఊహించుకోగలిగితే-చిట్టెలుకల్లాగా మనం నెలల తరబడి తిప్పుకుపోతున్న భూగర్భంలో ఆ చీకటిలో అవతలివైపునించి వచ్చే వాళ్లను కలుసుకోవాలనే కోరిక ఎంత బలంగా వుంటుందో, ఎంత ఉధృతంగా వుంటుందో-నీకు అర్థమవుతుంది."

ఆ దృశ్యాలన్నీ జ్ఞాపకం వచ్చి అతని ముఖం ఒక్కసారిగా వికసించింది. తన మాటలు వింటున్న బాటసారికి దగ్గరగా వచ్చి, అమాయకమైన చూపులతో అతని కళ్లలోకి చూస్తూ, మళ్లీ నెమ్మదిగా హాయిగా చెప్పటం ప్రారంభించాడు.

"మా మధ్యవున్న చిట్టచివరి కొండపొర బద్దలైపోయినప్పుడు, పచ్చటి దీపకాంతి ఆద్యారాన్ని వెలిగించినప్పుడు సంతోషబాష్పాలు వరుసకడుతున్న ఒకతల్లి ముఖం కనపడినప్పుడు, ఆ వెనుక అనేకదీపాలూ ముఖాలూ కానవచ్చినప్పుడు ఆసంతోషంలో విజయ కోలాహలం మిన్నుముట్టింది. నాజీవితంలోకల్లా అదే శుభదినం. ఆరోజు జ్ఞాపకంవచ్చినప్పుడల్లా నాజీవితం వృథ కాలేదనిపిస్తుంది. అది నేను చేసినపని, నాపని, పవిత్రమైన పని! నే చెబుతున్నాను, నమ్ము - ఆనాడు గుహాముఖంలోంచి బైటకువచ్చినప్పుడు మాలో చాలామందిమి భూమికి సాష్టాంగపడి, భూదేవిని పెదవులతో అద్దుకున్నాం. ఆ మహానందంతో రోదించాం కూడా! అదంతా దేవతాకథంత అద్భుతంగా వుం[illegible]ది. ఆరోజు మేము జయించిన పర్వతాన్ని [illegible] భూమిని ముద్దుపెట్టుకున్నాం; ఆరోజునే

కూడా భూదేవికి దగ్గరగావున్న ట్లనిపించింది. ఒకడు స్త్రీని ప్రేమించినట్లుగా, నేను ఆ నేలను ప్రేమించాను!

"తర్వాత, నిజంగా నాతండ్రి సమాధిదగ్గరకు వెళ్లాను. చనిపోయినవాళ్లు ఏదీ వినలేరని నాకు తెలుసు. అయినప్పటికీ వెళ్లాను. మనకోసం శ్రమించి మనతోపాటు కష్టాలన్నీ పంచుకున్న వాళ్ళ కోర్కెల్ని గౌరవించాలి కనుక వెళ్లాను. ఏమంటావు?

"సరే, నేను ఆయన సమాధిదగ్గర కెళ్లి, కాలితో నేల కదిలించి, ఆయన నన్ను కోరిన విధంగా చెప్పాను.

"'తండ్రీ, జయించాం! మానవుడు జయించాడు! ఆ సత్యం రుజువయింది!' అని."

# 4

# నా అనేవాళ్లు

రోముకూ జినీవాకుమధ్య ఒక స్టేషన్‌లో కండక్టరు మా పెట్టె తలుపు తెరిచేసరికి, అందులో ఒక వృద్ధుడు ప్రవేశించాడు. అతనికి పాపం ఒక్కొకన్నే వుంది, రెండోది బొత్తి పడి పోయింది. బండిలోకి అతన్ని క్లీనరు దాదాపు మోసుకు రావలసి వచ్చింది.

అతన్ని చూడగానే బండిలోనివారంతా అమాయకంగా చిరునవ్వులు నవ్వుతుంటూ 'శతవృద్ధులా వున్నా'డనుకున్నారు.

కాని ఆ వృద్ధుడు మాత్రం ఇంకా పూర్తిగా శక్తి కలవాడులాగానే వున్నాడు. ఆ ముడుతలుపడ్డ చేయెత్తి, తనకు సహాయం చేసిన వారికి కృతజ్ఞత తెలిపాడు. తర్వాత గౌరవసూచకంగా, తన వంగిపోయిన తలమీదినించి ఆ చింకి టోపీ కొంచెం పైకెత్తి, బల్లలమీద చుట్టూ కూర్చున్నవారి వంక నిశితంగా చూస్తూ "నన్ను కూర్చోనిస్తారా ?" అని అడిగాడు.

ప్రయాణీకులు సర్దుకొని చోటు చేసారు. అతను హాయిగా మోకాళ్ళమీద చేతులుపెట్టుకు కూర్చొని పెలవులు విప్పి అమాయకంగా బోసినవ్వు నవ్వుతున్నాడు.

"దూరప్రయాణమా! తాతా!" నా స్నేహితు డడిగాడు.

వెంటనే ఆ వృద్ధుడు జవాబు చెప్పాడు: "ఎక్కడిదీ, లేదు – ఇక్కడికి మూడు స్టేషన్లే! నా మనమడి పెళ్ళికి పోతున్నాను."

కొన్ని నిమిషాలయ్యేసరికి, తుపానుకు విరిగిన కొమ్మ లాగా అతను అటూ ఇటూ ఊగిపోతూ, ఆ చక్రాల లయకు తోడుగా తన కథ చెప్పేస్తున్నాడు.

"నేను లింగూరియన్ను. అసలు, మేం లింగూరియన్లం ఉన్నామే, చాలా గట్టివాళ్ళమనుకోండి. ఒక్కమాట నమ్మండి చెబుతాను – నాకు పదమూడుగురు కొడుకులు, నలుగురు కుమా రెలు, మనమళ్ళెంతమం దున్నారో నాకు తెలియదు. వీడు రెండోవాడు, పెళ్ళికు కొచ్చినవాడు. చాలా బాగుంది కాదూ?"

మనకేసి గా ఇంకా ఉత్తేజంగావున్న ఆ ఒంటికంటితో మావంక సగర్వంగాచూసి అన్నాడు: "చూడండి నేను నా రాజుకూ దేశానికీ ఎంతమంది బిడ్డల్ని ఇచ్చానో!"

"నాకన్ను ఎందుకు పోయిందనుకున్నారు! ఓహో, అదె ప్పుడో చాలా కాలం క్రితం సంగతి. అప్పుడు నేను మరీ చిన్న పిల్లవాణ్ణి. అయినా నా తండ్రికి పనిపాటుల్లో తోడ్పడుతుండే వాణ్ణే. ఒకనాడు ద్రాక్షతోటలో ఆయన గడ్డ విరుస్తున్నాడు. మా ప్రాంతంలో అంతా రాతినేల కనుక దాన్ని సాగుచెయ్య టానికి ఎంతో శ్రద్ధ తీసుకోవాల్సి వుంటుంది. ఆనాడు అలా ఇద్దరం పనిచేస్తున్నప్పుడు, మా నాన్న పలుగేసిన చోటినుంచి

ఒకరాయి ఎగిరివచ్చి నాకుడికంట్లో కొట్టుకుంది. ఆ బాధ ఇప్పుడు నాకు జ్ఞాపకంలేదు గాని, ఆ మధ్యాహ్నం నేను భోజనం చేస్తుండగా నా కంటిగుడ్డు క్రిందికి రాలిపోయింది. ఎంత భీభత్సంగా వుందనుకున్నారు! తర్వాత మావాళ్లు ఆగుడ్డు, మళ్లీ లోపలికి నెట్టేసి, ఏవేవో కాపులు కాచారు; కాని లాభం లేకపోయింది; ఆ కన్ను కాస్తా పోయింది!"

ఆ వృద్ధుడు వేళ్లాడుతున్న తన దవడలమీద బలంగా రుద్దుకొని, సంతోషంగా తిరిగి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"ఆరోజుల్లో, ఇప్పుడున్నంతమంది డాక్టర్లు లేరు. జనం మూర్ఖంగా బ్రతికేవాళ్లు. అంతే. కాని, బహుశా వాళ్లే ఎక్కువ దయగా వుండేవాళ్లేమో!"

లోతైన ముడతలతోను, మాసిన గడ్డంతోను నిండిన అతని మొహంలో ఈసారి వ్యంగ్యధోరణి గోచరిస్తున్నది.

"నేను జీవించినన్నాళ్ళు జీవించిన తర్వాత మీరు కూడా మనుష్యుల్ని సరిగ్గా అర్థం చేసుకోగలుతారు. అంతే నంటారా, మరి?"

ఎవరినో ఎత్తి చూపుతున్నట్టుగా తన నల్లటి వంకర వేళ్లెత్తి చూపుతూ, "మనుష్యుల్ని గురించి కొంచెం చెబుతా, వినండి..." అని ప్రారంభించాడు.

"నాతండ్రి పోయేనాటికి నాకు పదమూడేళ్లు. అప్పుడు నేను ఇప్పటికంటేకూడా దుర్బలంగా వుండేవాణ్ణి. కాని పని వచ్చేసరికి, బరువూ బద్ధకం ఎరక్కుండా ఒళ్ళు విరుచుకునేవాణ్ణి. మాపొలమూ ఇల్లూకూడా అప్పులకింద కట్టివెయ్యవలసిరావటంతో, నాతండ్రినుంచి నాకు సంక్రమించిదల్లా కష్టం

చెయ్యటం ఒక్కటే. ఆవిధంగా, ఈ ఒక్కకంటితో రెండు రెక్కల్తో, ఎక్కడపనిదొరికితే అక్కడ, కష్టపడి జీవించాను. అది చాలా కష్టమే. కాని యౌవనం కష్టాలకు జంకదు గదా?

"నేను ఎవర్ని ప్రేమించాలని వ్రాసిపెట్టివుందో ఆ అమ్మాయిని, నా వంతొమ్మిదోయేట, కలుసుకున్నాను. ఆమెకూడా నాఅంత పేదదే కాని, నాకంటె ఊరాగా బలంగా వుండేది. వృద్ధురాలై పోయి కదలలేనిస్థితిలోవున్న తన తల్లితో కలిసి నివసిస్తూ, ఆ అమ్మాయికూడా నాలాగానే చేతికందిన పనల్లా చక్కబెట్టుకుంటూ బ్రతుకుతుండేది. ఆమెప్రత్యే కించి చక్కనిది కాదుగాని, చాలా దయగలమనిషి. మంచికంఠం కూడా; ఎంత చక్కగా పాడేదని! సరీగా పాటగత్తెలాగా పాడేది. మంచి కంఠానికి చాలా గౌరవం వుంది కూడా. నావరకు నేనూ బాగానే పాడేవాణ్ణి.

" 'మనం పెళ్ళి చేసుకుందామా?' అని ఒకనాడు అడిగాను.

" 'ఓరి వెర్రివాడా, ఎంత తెలివితక్కువ! నీదగ్గరగానీ నాదగ్గరగానీ చిల్లిగవ్వలేదే! ఎట్లా బ్రతుకుతాము?' అని విచారంగా బదులు చెప్పింది.

" నిజంగా అది వేదాంతురం: ఆమెకుగానీ నాకుగానీ ఉన్న ఆస్తి ఏమీలేదు. కాని ప్రేమలో వున్న యువతీయువ కులకు ఏంకావాలి? ప్రేమకు ఇతరఅవసరాలు ఎంత అల్పమో మీకు తెలుసు. ఆమెకు నచ్చచెప్పి ఒప్పించాను.

" 'నువ్వు చెప్పేది నిజమే అనుకో. ఇప్పుడు మనం విడివిడిగా జీవించేటప్పుడు తోడ్పడే దేవుడికి, మనం కలిసి

జీవించినప్పుడు తోడ్పటం మరీ తేలిక!' అంది 'ఇడా' చివరకు.

"తర్వాత మేము పురోహితుడి దగ్గిర కెళ్ళాం.

"'ఇది వట్టి పిచ్చి! ఇప్పుడు లిగూరియా వీధుల్లో బిచ్చగాళ్ళు చాలకనా? దురదృష్టవంతులు—మీరు సైతాన్ చెప్పినట్లు ఆడుతున్నారు. ఈదుష్ట ప్రేరణల్ని అణచుకోండి. లేకపోతే, ఈ మీ దౌర్బల్యానికి తర్వాత చాలా బాధపడ వలసి వుంటుంది!' అని చెప్పాడు పురోహితుడు.

"ఊళ్లో వయసువాళ్ళంతా మమ్మల్ని వేళాకోళం చేసారు, పెద్దలు మందలించారు. కాని యౌవనం చాలా మొండిది, దాని దారిన అది తెలివెందకూడా! పెళ్ళిరోజు వచ్చేసింది. అంతకుముందుకంటే ఆరోజు మాదగ్గిరున్న సిరి ఏమీ లేదు. పెళ్ళి అయినతర్వాత, ఆరాత్రి మేము ఎక్కడ నిద్రించాలోకూడా మాకు తెలీదు.

"'పొలాల్లోకి పోదాం. ఏం, పోకూడదా? ఎక్కడికి పోయినప్పటికీ ఈ భూమాత తన బిడ్డలందరిపట్లా దయామయురాలే!' అని ఇడా సలహాచెప్పింది.

"అలాగే అని ఇద్దరం అనుకున్నాం. 'భూమే మన పానుపు, ఆకాశమే మన చాందినీ.'

"ఏమండో, ఇక్కడమళ్ళీ ఇంకోకథ ప్రారంభమైంది. మీరు శ్రద్ధగా వినాలి. నాజీవితంలోకల్లా ఇదే గొప్పది!

"రేపు పెళ్ళి అనగా ఇవాళటి ప్రొద్దుట, గివానీ అనే వృద్ధుడు, చాలాకాలం నాచేత పనిచేయించు కున్నాయన, నన్ను పిలిచి ఒక మాటచెప్పాడు. అసలు అలాంటి విషయాలు

మాట్లాడటం ఆయనకు ఇష్టం వుండదు కనుక, నోటమాట రాకుండా ఊపిరి లేనట్టు నెమ్మదిగా అన్నాడు :

" 'యూగో, నువ్వు ఆ గొర్రెల కొట్టం బాగుచెయ్యాలి. పైన కురవకుండా కొంచెం గడ్డికూడా వెయ్యాలి. ఏడాది నుంచీ అందులో గొర్రెల్ని కట్టెయ్యటం లేదు. పొడిగానే వుంది. కాని, నువ్వూ ఇడా అందులో కాపరం పెట్టాలంటే మాత్రం శుభ్రం చేసుకోటం మంచిది'.

"ఇంకేం, మాకు ఇల్లు ఏర్పడ్డది.

"హాయిగా పాడుకుంటూ, ఆ గొర్ల కొట్టం శుభ్రం చేసుకొంటుండగా, గడపలో వడ్రంగి కొస్టాంజో కనిపించాడు.

" 'అహా — ఇక్కడా నువ్వూ ఇడా నివసించేది ? ఏదీ మీకు మంచం లేదే! నాదగ్గిర ఒకటి విడిగా వుందిగాని, నీపని కాగానే వచ్చి తెచ్చుకో!' అన్నాడు.

"నా పని పూర్తి చేసుకొని, నేను అతని ఇంటికి పోతుండగా, ప్రో[illegible] గయ్యాళిగంప, మేరియా అనే గుడ్డలకొట్టు ఆమె కనిపించి, కేక లేస్తూ చెప్పింది :

" 'పెళ్ళి చేసుకుంటున్నారు! బుద్ధి లేకపోతే సరి! తమ పెరటికి ఒక్క దూడుగానీ, జంపకానాగానీ లేదు! ఓరి ఏకాక్షీ, నీకు మతిపోయిందిగాని, ఆ పిల్లను నా దగ్గిరికి పంపించు...'

"నరాల దౌర్బల్యంతోనూ జ్వరంతోనూ తీసుకుంటున్న కుంటి పియానో తన గడపలోంచి ఆమెను పిలిచి అడిగాడు :

" 'అతిథులకోసం ఎంత సారా తెచ్చి వుంచాడో వాణ్ణి కనుక్కో! మనుషులు అంత మతిలేకుండా ఎలా వుంటారు ?' అని."

ఈమాట చెప్పేసరికి అతని చెక్కిటి ముడతలమీద ఒక బొమ్మబిందువు తళతళ లాడింది. మళ్ళీ మొహమెత్తి ఓబోసి నవ్వు నవ్వాడు. మళ్ళీ దవడలు ఆడిస్తున్నాడు. వదులుగా వున్న ఆ చర్మం వణికిపోతున్నది.

పసిపిల్లవాడిలాగా సంతోషంతో చేతులూపుతూ, విరగబడి నవ్వుతూ, "వినండి, వినండి!" అని చెప్పటం మొదలు పెట్టాడు.

"మా పెళ్ళినాటి ఉదయానికల్లా మాయింటికి అవసరమైన వస్తువులన్నీ ఏర్పడ్డాయి - మేడోనా విగ్రహం ఒకటి, భోజనపదార్థాలు, దుస్తులు, కొయ్యసామగ్రి - అన్నీ ఏర్పడ్డాయి. చెబితే నమ్మండి - ఆ సంతోషం పట్టలేక ఇడా నవ్వి నవ్వి ఏడ్చేసింది; నేను కూడా అంతే. కాని తక్కిన వాళ్లంతా నవ్వుతూనే వున్నారు. పెళ్లినాడు ఏడవటం తప్పు కనుక మావాళ్లంతా మమ్మల్ని చూచి నవ్వుకున్నారు.

"నా అనేవాళ్ళు వుండి 'వీళ్ళు నావాళ్ళు' అని చెప్పుకోటం ఎంతగొప్ప ఇదిగావుంటుంది! అంతేగాక, మన జీవితాన్ని అల్పంగా చూడకుండా, మనసుఖాన్ని తమ ఆటవస్తువుగా తలచకుండా వుండేవాళ్ళు ఈ జనమంతా - మనవాళ్ళుగా, మన సన్నిహితులుగా మన ఆప్తులుగా అనుకోటం మరీ బాగుంటుంది!

"ఎంతగొప్పపెళ్ళి అది! ఎంతసుదినం! ఊరుఊరంతా ఆ ఉత్సవానికి హాజరైంది. అప్పటికప్పుడు ఓ పెద్దభవనంగా మారిపోయిన మాకొట్టానికి ప్రతిఒక్కరూ వచ్చారు...మాకు దేనికీ కొరత లేదు! రొట్టె, మాంసం, పళ్ళు, సారాయి—

అందరూ సుష్టుగాతిన్నారు. సంతోషంగా వున్నారు...అదంతా ఎందువల్లంటే : ఎదటివాడికి మేలు చేసేకంటే ఎక్కువ ఆనందమేమీ లేదు, నామాట నమ్మండి, అంతకంటె అందమైంది కూడా ఏమీ లేదు !

"పురోహితుడు కూడా వచ్చాడు. చక్కగా ఉపన్యసిస్తూ, ఇలా చెప్పాడు : 'మీ అందరికోసం రెక్కలు విరుచుకున్న మనుషులు ఇద్దరు ఇక్కడున్నారు. ఈ రోజును వాళ్ళ జీవితంలోకల్లా ఉత్తమమైందిగా చెయ్యటానికి మీ చేతనయిందల్లా చేసారు. వాళ్ళు మీకోసం కష్టించారు కనుక, వాళ్ళనిలా కనిపెట్టి వుండటం భాగ్యం ! వెండి బంగారు నాణాలకంటే పని ఎక్కువ ముఖ్యమైంది; మీరు పొందే ప్రతిఫలంకంటే పని ఎప్పుడూ ప్రధానమైందే ! ధనం నశిస్తుంది. కాని, పని మాత్రం నిలుస్తుంది...ఇప్పుడు వీళ్ళు హాయిగా నిబ్బరంగా వున్నారు. అయితే, వాళ్ళ జీవితం గడ్డుగానేవుంది, కాని ఏమీ చెప్పుకోటంలేదు; ముందు ముందు మరీ గడ్డుగా వుంటుంది, కాని రుస రుసలాడరు. వాళ్ళ అవసరానికి మీరుకూడా ఆదుకోవాలి. వాళ్ళకు దృఢమైన హృదయాలూ, బలిష్ఠమైన చేతులూ వున్నాయి.'

"ఇంకా ఆయన నన్నూ ఇడానూ ఆ వచ్చిన వాళ్ళందర్నీ పొగుడుతూ అనేక విషయాలు చెప్పాడు !"

గతించిన యౌవనం మళ్ళీ ఆకంటిలో మెరుస్తున్నట్టుగా, వృద్ధుడు మా అందరివంకా చూసి —

"జనాన్ని గురించి మీకు కొంచెం చెప్పాను. బాగుంది గదా !" అన్నాడు.

# 5

# మాతృదేవి

---

అజేయ జగజ్జీవితానికి అనంత ప్రాణవాహినియైన మాతృదేవిని కీర్తిద్దాం? ఆ స్త్రీమూర్తిని, వేయి గొంతు లెత్తి, ప్రశంసిద్దాం!

ఇది ఆరాతిగుండెవాడు, కుంటితైమూర్ కథ. అదృష్ట వంతుడైన ఆ విజేతను 'సఖిమీకిరాని' అనేవాళ్ళు. నాస్తి కులు 'తామర్లేను' అని పిలిచేవాళ్ళు. ఆ కుంటి చిరుతగండు సమస్త ప్రపంచాన్ని ధ్వంసం చెయ్యాలని సంకల్పించాడు.

పెద్ద ఏనుగుపాదం చీమలపుట్టలను తొక్కేసినట్టుగా, అనేక నగరాలనూ, దేశాలనూ తన ఉక్కుమడిమకింద నుగ్గునూచం చేస్తూ, యాభై సంవత్సరాలు, కుంటితైమూరు భూభాగం సంక్షోభింపజేసాడు. అతను తలెత్తింది మొదలూ, ఎటుచూసినా కెంపెక్కిన రక్తవాహినులే ప్రవహించాయి. అతని కొడుకు జిగాంజీర్ మరణానికి ప్రతిక్రియగా, మృత్యుశక్తికీ తన శక్తికీ పోటీపెట్టి ఎవరెక్కువ చంపగలరో అని పందెం వేసుకొని అతను జీవితాన్ని ధ్వంసం చేసాడు. మృత్యువుకింకా ఎవ్వరూ దొరక్కుండా చెయ్యాలనీ, ఆకలిపుట్టి నిస్పృహతో మృత్యువు చచ్చిపోవాలనీ – అందుకని తానే అందరినీ చంపెయ్యాలనీ ఆ రాక్షసుని కోరిక!

అతని కొడుకు జగాంజీర్ మరణించినప్పుడు గల్లటి మనసులో దుఃఖస్వరూపాల్లాగా నెత్తిన బూడిదామన్నూ విర జల్లుకుంటూ సామర్కండ్ జనం అతన్ని సందర్శించిననాటినుంచీ చివరకు అట్రారిలో మృత్యువువాతపడేనాటివరకూ తైమూర్ మొహాన నవ్వు అనేది లేదు. ఎప్పుడూ అలా పెదవులు బిగ బట్టుకుని వుండేవాడు. ఆహృదయంలో మానవస్నేహజమైన ఉద్రేకాలను చోరనిచ్చేవాడు కాదు. అవిధంగా తలవాల్చ కుండా అతను ముప్పయ్యేళ్ళు జీవించాడు.

ఏమూలలో కిముందు మృత్యువు విజయవినమ్రమై తల వాల్చుతుందో, ఆ మాతృదేవిని కీర్తిద్దాం; ఆ స్త్రీమూర్తిని ప్రశంసిద్దాం! అరాతిగుండెవాడు, మృత్యుమాత, యమ కింకరుడు, రక్తపిపాసి అయిన తామర్లేన్, మాతృదేవి ఎదుట, శిరస్సు వంచిన ఉదంతం చెప్పుకుందాం' మాతృదేవిని ప్రశంసిద్దాం!

ఇదే కథ:

సామర్కండ్ కవులు పూలలోయగా వర్ణించే కాని గుల్లా లోయలో, మల్లెలూ గులాబీలూ విరియబూచి మేఘాలవలే అల్లుకున్న చోట, అటు నగరంలోని రాజ భవనాల నీలిశిఖరాలూ, మసీదుల గోపురాలూ గోళా ల్లాగా కనిపిస్తూ వున్న ఆ సుందర ప్రదేశంలో, ఒకనాడు, కుంటి తైమూరు విందారగిస్తున్నాడు.

ఆ లోయనిండా విసినకర్ర ఆకారంలో పదిహేనువేల గుడారాలు, పదిహేనువేల పూలమొక్కల్లాగా, అమర్చబడి

వున్నాయి. ప్రతి గుడారంమీదా, వంకలాదిగా పట్టుకుచ్చులు ఆగాలిలో పూలలాగా విచ్చుకుంటున్నాయి.

పరివారంమధ్య రాణిమూదిరిగా, ఆ గుడారాల మధ్య తైమూర్ గుడారం వుంది. ఆ గుడారం నలుముఖాలుగా వుంది. ఎటుచూసినా నూరడుగుల పొడుగూ, మూడు ఈటెల ఎత్తూ! ఒక్కొక్కటి మనిషిలావు బంగారపు కడ్డీలు పన్నెండింటితో దాని నడికొప్పు మోపుచెయ్యబడి వుంది. దానిపైన ఒక నీలి గోపురం వుంది. ప్రక్కలకు - నలుపు పసుపు నీలం చారలు గల సిల్కుతో గుడారం దిగివుంది. అది గాలికి లేచి పోకుండా ఐనువందల త్రాళ్ళతో-రక్తం లాంటి ఎర్రటి త్రాళ్ళతో - దాన్ని నేలకు బిగించి కట్టారు. ఆగుడారం నలుమూలలా నాలుగు వెండి డేగలు కూర్చొనివున్నాయి. ఆగోపురానికి క్రిందుగా, డేరాలో వేదికమీద ఆ అజేయుడైన రాజాధిరాజు కుంటితైమూర్ కూర్చొనివున్నాడు.

అతను, ముత్యాలు తాపిన నీలాంబరం ధరించాడు. అయిదువేలు ఆణిముత్యాలు ఆ నీలాంబరంమీద తళతళ లాడుతున్నాయి. అతని భయంకరమైన కనుబొమలపైన తెల్లటి టోపీ వుంది. దానిచివర, జగత్తును పర్యాలోకిస్తున్న రక్తనేత్రంలాగా, ఒక కెంపు, ఉయ్యాల లూగుతున్నది.

కుంటితైమూర్ ముఖం, సహస్ర పర్యాయాలు రక్తంలో మునకలాడి, తుప్పుపట్టిన కసాయికత్తిలాగా వుంది. అతని కళ్ళు చిన్నవి, దేన్నీ ఏమరేవి కావు. ఆ కళ్లలోని కాంతి, 'జారమట్' కాంతిలాగా, నిశ్చలంగావుంది. (జారమట్ అంటే అరబ్బులఅభిమానరత్నం; దీర్ఘ వ్యాసమని కనుగొన్నతుం

డట. ఇతరులుదాన్ని 'పచ్చ' అంటారు) చక్క ని కన్నెపిల్ల పెద వుల్లా మెరిసే సింహళపు కెంపులు తాపిన పోగులు పెట్టు కున్నాడు.

గుడారంలో ఆ చక్కని తివాచీలమీద మూడు వందల పైడి కూజాలు ద్రాక్షసారాయంతో నిండి వున్నాయి. ప్రతిదీ రాచవిందుకు తగినట్లు అమర్చబడి వున్నది. తైమూరు వెనుక గాయకులు కూర్చున్నారు. ప్రక్కన ఎవ్వరూ లేరు. అతని పాదాలవైపున రాజబంధువులూ, సామంతులూ, యువ రాజులూ, దళాధిపతులూ వున్నారు అందరికంటే అతనికి మరీ ఆప్తుడైన కవి, కెర్మానీ, తాగి వున్నాడు.

"కెర్మానీ, ఒకవేళ నన్ను అమ్మినట్లయితే నువ్వు ఎంతకు కొంటావు?" అని తైమూర్ ఒకప్పుడు కవిని ప్రశ్నించాడు.

"పాతిక రూపాయలకు." అన్నాడు కవి.

"నా బెల్టు ఒక్కటే పాతిక రూపాయలు చేస్తుందే!" అన్నాడు ఆశ్చర్యంతో తైమూరు.

"ఔను. అదే, ఆ బెల్టు విషయమే ఆలోచిస్తున్నాను. నీ అంతట నువ్వే అయితే దమ్మిడీ కూడా చెయ్యవ్" వన్నాడు కెర్మానీ.

భీభత్స మూర్తియైన ఆ రాజాధిరాజుకు కవి కెర్మానీ చెప్పిన సమాధానం ఇది. సత్యమిత్రుడైన ఆ కీర్తి తామర్లేన్ ప్రఖ్యాతిని అధిగమిస్తుందిగాక!

నిర్భయమైన సత్య సౌందరమైన వాగ్దేవిని ఆరాధించే

కవులను క్రీడిద్దాం! వారికి ద్రగీతాలు ఆలపిద్దాం! కవికి సత్యమే వాగ్దేవి!

అక్కడ తైమూర్ దర్బారులో గందరగోళంగా విందు జరుగుతున్నది. యుద్ధాలనూ విజయాలనూ అద్భుతంగా చెప్పుకుంటున్నారు. బిగ్గరగా వాద్యగానం వినిపిస్తున్నది. కొందరు ఆటపాటల్లో మునిగిపోతున్నారు. హాస్యగాళ్లు అటూ ఇటూ తిరుగుతున్నారు. వస్తాదులు కుస్తీ ప్రదర్శనాలు చేస్తున్నారు. దొమ్మరివాళ్లు, తమ శరీరాల్లో ఎముకలే లేనట్లుగా, వివిధ పరిశ్రమలూ ప్రదర్శిస్తున్నారు. యోద్ధలు కత్తిసాములో తమ హాత్యానై పుణ్యాన్ని చూపుతున్నారు. ఏనుగుల ప్రదర్శనం ఒకటి - కొన్నిటికి ఎర్రరంగూ, కొన్నిటికి ఆకుపచ్చా వేసి, కొన్ని మరీ భయంకరంగా, కొన్ని హాస్యాస్పదంగా కనిపించేట్టుచేసి ఆనందిస్తున్నారు. ఆ పరివారమంతా సమ్రాట్టు నందలి భయంతోనూ, అతని క్రీర్తిగర్వంతోనూ, విజయాల మీది విసుగుతోనూ, ద్రాక్షసారాయం, గుర్రపుపాల రసాయం తాగిన కైపుతోనూ, మత్తెక్కి వున్నారు. అంతా అలా ఉధృతంగా ఉన్న ఆ తరుణంలో, ఆ కోలాహలాన్ని ఛేదించుకొని మేఘాన్ని చీల్చుకొని వచ్చే మెరపులాగా, ఒక స్త్రీ గొంతు, ఆడడేగ గర్వారుతం లాంటిది, కొడుకు చావుతో గాయపడి ప్రాణికోటిపై పగబట్టిన తైమూర్ భగ్న హృదయానికి అనురూపమైన శబ్దం అతనికి - సుల్తాన్ బయాజిద్‌ను జయించిన అతనికి - తైమూరుకు వినవచ్చింది.

ఆ విషాదకంఠం ఎవరిదో కనుక్కోమని తైమూర్ తన వాళ్ళకు ఆజ్ఞాపించాడు. ముఱికి పీలికలు కట్టుకొని ఎవరో పిచ్చి

మనిషి వచ్చిందనీ, అరబ్బీభాషలో మాట్లాడుతూ, అతన్ని, ప్రపంచంలోని మూడు ముఖ్యకేంద్రాల అధిపతియైన తైమూర్‌ను చూడాలని పట్టుపడుతున్నదనీ వారు చెప్పారు.

"ఆమెను లోపలికి తీసుకురండి!" అని తైమూర్ ఆజ్ఞాపించాడు.

ఆమె వచ్చి అతని ఎదుట నిలబడింది. ఆమె కాళ్ళకు చెప్పులు లేవు. ఆమె కట్టుకున్న ఆ చింకిపాతలు ఎండకు వెలిసి పట్లున్నాయి. ఆమె నల్లటి జుట్టు పాయలు పాయలుగా రొమ్ములమీద పడి ఆ నగ్నభాగాన్ని కప్పివేస్తున్నది. ఆమె మొహం కాంస్యప్రతిమలాగా వుంది. ఆ కళ్ళల్లో దర్పం కనిపిస్తున్నది. కుంటి తైమూర్ నంకకు ఎత్తిన ఆమె కఠోర హస్తం కంపించటం లేదు.

"నువ్వేనా సుల్తాన్ బయేజిద్‌ను జయించినవాడివి?" ఆమె ప్రశ్నించింది.

"ఔను. ఇంకా చాలామందిని జయించాను. విజయాల మోజుకూడా ఇంకా నాకు తగ్గలేదు. ఇంతకూ నీ సంగతి ఏమిటి?"

"విను. నువ్వేమి చేసినప్పటికీ నువ్వుకూడా మనుష్యమాత్రుడివే. నేను మాతృదేవిని! నువ్వు మృత్యువును సేవిస్తున్నావు, నేను జీవితాన్ని సేవిస్తాను. నువ్వు నాకు ద్రోహం చేసావు. కనుక నీ తప్పు నువ్వు దిద్దుకోమని చెప్పడానికే ఇక్కడికి వచ్చాను. 'న్యాయంలోనే బలం వుంది' అని నువ్వు అంటావని నాకు తెలుసు. కాని అందులో నాకు

నమ్మకం లేదు. ఏమైనా, మాతృదేవిని కనుక నువ్వు నాపట్ల న్యాయంగా ప్రవర్తించాలి!"

ఈ సాహస వచనాల వెనుక వున్న శక్తి ఏమిటో తెలుసుకునేపాటి ఉపజ్ఞ తైమూరుకు లేకపోలేదు.

"కూర్చో. చెప్పు, నీ మాట వింటాను"

ఆమె తివాచీమీద రాజపురుషులమధ్య సుఖాసీనయై చెప్పటం ప్రారంభించింది:

"నేను ఇటలీలో ఎక్కడో దూరంగావున్న సాలెర్నో ప్రాంతంనుంచి వచ్చాను. నువ్వు బహుశః ఆ ప్రాంతాలు ఎరగవు! నాతండ్రి చేపలుపట్టేవాడు. నా భర్తకూడా జాలైవాడే. కాని, సుఖజీవులంతా ఎంత అందంగా వుంటారో అంత అందంగా వుండేవాడు. ఆయనకు సుఖాన్నిచ్చింది నేను! నాకొక బిడ్డ కలిగాడు — ప్రపంచంలోకల్లా చక్కని చుక్క..."

"నాజిగాంజేర్ లాగా..." అని ఆ వృద్ధయోధుడు గొణుక్కున్నాడు.

"నాబిడ్డ అందరికంటె చక్కనివాడు, తెలిసికలుస్తాను! మాతీరాన అరబ్ దుండగీండ్రు దిగేనాటికి, నాబిడ్డ ఆరేళ్ళవాడు. వాళ్ళు నాతండ్రినీ భర్తనూ — ఇంకా ఎందరినో చంపారు. నాబిడ్డను ఎత్తుకుపోయారు. నాలుగు సంవత్సరాలుగా నేను ఆబిడ్డకోసం భూనభోంతరాళాలు గాలిస్తున్నాను. ఇప్పుడు వాడు నీచేతిలోవున్నాడని నాకు తెలుసు: ఆ దుండగీండ్రను బయేజిద్ సైనికులు జయించారు, కొల్లగొట్టారు; నువ్వు బయేజిద్‌ను జయించి, అతని సర్వస్వం కొల్లగొట్టావు.

కను వాడిప్పుడు నీ చేతిలో వున్నాడు. వాడెక్కడ వున్నాడో తెలుసుకొని, నువ్వు నా బిడ్డను నాకు తిరిగి ఇప్పించి తీరాలి!"

అంతా ఒక్కసారిగా నవ్వారు. అందరిలోకీ తెలివైన వాళ్ళమనుకునే సామంతులూ, తైమూర్ మిత్రులూ, దళాధిపతులూ "ఆమె పిచ్చిది!" అని నవ్వటం ప్రారంభించారు.

కవి కెర్మానీ ఒక్కడే ఆమెవంక గంభీరంగా చూస్తున్నాడు; తామర్లేన్ ఆమెను ఆశ్చర్యంతో పరికిస్తున్నాడు.

"మాతృత్వం ఎంత పిచ్చిదో, ఆమె కూడా అంత పిచ్చిది" అన్నాడు తాగివున్న కవి కెర్మానీ.

శాంతికి ఆగర్భ శత్రువైన తైమూర్ ఆమె వంక చూసి అన్నాడు:

"ఓ స్త్రీ! ఆ సముద్రాలూ నదులూ కొండలూ దాటి అడవుల్లోనుంచీ తుప్పలలో నుంచీ ఆ అజ్ఞాతప్రాంతంనుంచి ఇంత దూరం నువ్వు ఎలా వచ్చావు? ఆ అడవి జంతువులూ, వాటికి తోడు రాక్షసంగా వుండే అడవి మనుషులూ నిన్ను చంపకుండా వదిలిపెట్టటం ఎలా జరిగింది? నిరాయుధంగా ఒంటరిగా నువ్వు ఇంత దూరం ఎలా ప్రయాణం చేసావు? యజమాని చేతిలో ప్రయోగించే శక్తి వున్నంతవరకూ ఎన్నడూ ద్రోహం చెయ్యని రక్షణ లేనివాళ్ళ ఒకే ఒక రక్షణ - ఆయుధమే కదా! అన్నా నేను నమ్మాలంటేనూ, నువ్వు చెప్పదలచుకున్నదంతా అర్థం చేసుకోటంలో నాకు ఆశ్చర్యం అడ్డుపడకుండా వుండాలంటేనూ - ముందు నా సందేహం తీర్చు!"

... ఆమె ఏ అడ్డంకుల్నీ ఎరగదో, ఎవరి స్నేహం

ఈ సమస్త ప్రపంచాన్నీ పోషించిందో - ఆ మాతృదేవిని కీర్తిద్దాం! ఆ స్త్రీ కీర్తిగీతాలు ఆలపిద్దాం! మానవుడిలో అందమైన ప్రతిదీ, సూర్యకిరణాలనుంచీ, మాతృస్తన్యంనుంచీ, వచ్చింది. అందువల్లే ఇది మనలో జీవితంమీాది ప్రేమను రేకెత్తిస్తుంది!

ఆమె జవాబు చెప్పింది:

"నా ప్రయాణాల్లో నేను ఒక్క సముద్రాన్నే చూశాను. అందులో ఎన్నో లంకలూ, చేపలు పట్టేవాళ్ళ పడవలూ వున్నాయి. ఎవరైనా తమ ప్రియతముల్ని వెతుక్కునేటప్పుడు గాలి చాలా అనుకూలంగా వుంటుంది. సముద్రతీరాన పుట్టిపెరిగినవాళ్ళకు నదు లీదటం అట్టే కష్టం కాదుకూడా. ఇక కొండలు? నేను వాటిని గమనించనే లేదు."

"ప్రేమమయాత్ములకు మహాపర్వతం చిన్న లోయ లాగావుంటుం!" దన్నాడు తాగివున్న కెర్మానీ, సంతోషంగా.

ఆమె తన ప్రయాణాన్ని వర్ణిస్తూనే వుంది:

"అడవులమాట! ఔను: అడవిపందులూ, ఎలుగు బంట్లూ, సివంగులూ, కొమ్ములు వంచి భయంకరంగా కని పించే ఎద్దులూ ఎదురుపడ్డాయి. నీ కళ్ళలాంటి కళ్ళతోటే రెండుసార్లు చిరతగండ్లు నావంక చూశాయి. కాని ప్రతి జంతువుకూ హృదయం వుంది. నేను నీతో మాట్లాడుతున్నట్లు గానే, వాటితోటీ మాట్లాడాను. నేను మాతృదేవిని అని చెప్పినప్పుడు అవి విశ్వసించాయి. నాయందు జాలిచలచి, నిశ్వ సిస్తూ వాటిదారిన అవి వెళ్ళిపోయాయి! నీకు తెలీదా?

జంతువులుకూడా తమ బిడ్డల్ని ప్రేమిస్తాయని ; తమ బ్రతుకు కోసం, తమ స్వాతంత్ర్యంకోసం - మం మనుషులకంటే ఏమీతీసిపోకుండా - పోరాడతాయని ! ”

“ బాగా చెప్పావు. మనుషులకంటె, తరచుగా, జంతువులే ఎక్కువ గాఢంగా ప్రేమిస్తాయి ; దీక్షగా పోరాడతాయి - అని నాకు తెలుసు ! ” అన్నాడు తైమూర్.

ఆమె పసిబిడ్డలా చెప్పటం ప్రారంభించింది. ప్రతి తల్లి హృదయంలోనూ వందరెట్లు పసితనం గూడు కట్టుకొని వుంటుంది.

“ప్రతి మనిషికీ తల్లివుంది కనుక, తల్లులకు మనుష్యులందరూ బిడ్డలే !

“వృద్ధుడా ! నువ్వుకూడా ఒక తల్లి కడుపున పుట్టావు. నువ్వు దేవుణ్ణి ఒప్పుకోకపోవచ్చు, కాని ఈ సత్యాన్ని మాత్రం ఎన్నడూ తిరస్కరించలేవు ! ”

నిర్భీకుడైన కెరాక్రని చకితుడై ఇలా అన్నాడు :

“బాగా చెప్పావు, తల్లీ ! బాగా చెప్పావు ! ఎద్దుల మందలోంచి మాడలు రావు. సూర్యకాంతి లేకుండా పూలు వికసించవు. ప్రేమలేని సుఖంలేదు. స్త్రీ లేని ప్రేమలేదు. తల్లులు లేనిదే-కవులు లేరు, వీరులూ లేరు ! ”

“నేను వాడి తల్లిని కనుక, వాణ్ణి ప్రేమిస్తున్నాను కనుక, నా బిడ్డను నాకు ఇప్పించండి ! ” అని ఆమె మళ్ళీ అడిగింది.

మోసెస్‌నూ, మహమ్మద్‌నూ, మహాప్రవక్త క్రీస్తునూ కన్న స్త్రీకి తలొగ్గుదాం ! ఆ మహాపురుషులకు స్త్రీ ప్రాణం

ఇచ్చింది; వారికే దుష్టులు చావు తెచ్చారు. షరీఫ్ ఉద్దీన్ చెప్పినట్లు—మళ్ళీ ఒకనాడు వారు తలెత్తుతారు; బ్రతికున్న వారికీ, చనిపోయిన వారికీ న్యాయం చెబుతారు !

నిరంతరం మహాపురుషులకు జన్మదానం చేస్తున్న స్త్రీ కి తలొగ్గి నమస్కరిద్దాం ! ఆరిస్టాటిల్ ఆమె బిడ్డ. తేట తేనియలు చిల్కనఫిరదౌసీ, సాదీ; విషంకలిపి ద్రాక్షాసవం చిమ్మిన ఉమర్ ఖయాము; ఇస్కందరూ, ఆ అంధకవిహోమరూ — అందరూ ఆమెబిడ్డలే ! అందరూ ఆమె స్తన్యం గ్రోలారు; చిన్నతనంలో చేయిపట్టుకొని ఈఅందరినీ నేలమీద అడుగుపెట్టించింది ఆమే ! జగత్తుయొక్క మహాత్మ్యమంతా తల్లుల్లోనుంచే వచ్చింది !

ఆ భయంకర నగర విధ్వంసకుడు, కుంటి చిరత గండు, తైమూర్ ఆలోచనలో మునిగిపోయాడు. చాలాసేపు అలా నిశ్శబ్దం ఆవరించింది. తర్వాత తైమూర్ తనచుట్టూవున్న వాళ్ళతో ఇలా అన్నాడు :

"ఓ తైమూర్ అనుచరుల్లారా ! దేవమాతనైన నేను, తైమూర్ను, ఏంచెప్పాలో — అదే చెబుతున్నాను ! నేను అలా బ్రతికాను. అనేకసంవత్సరాలు ఈజగత్తు నాపదఘట్టనలో ఘూర్ణిల్లిపోయింది. నాకొడుకు మరణానికి ప్రతీకారం చెయ్యాలనీ, నాహృదయంలోని జీవితభానుణ్ణి అస్తమింపజెయ్యాలనీ ఇప్పటికి ముప్ఫయేళ్ళుగా నేను జగద్విధ్వంసనం సాగిస్తున్నాను. అనేకమంది నాతో రాజ్యాలకోసం పట్టణాలకోసం పోరాడారు. కాని ఒక్కడూ మానవుడికోసం పోరాడలేదు. అదేకాక, నాదృష్టిలో మానవుడికి ఎన్నడూ ఏమీ విలువ కూడా లేదు. నాకెదురు

నిలిచినవాడెవడో, వాడెందుకు నిలిచాడో కూడా నేను తెలుసుకోలేదు. బయేజిద్ అపజయంపొంది నాదగ్గరికి వచ్చినప్పుడు, నేనే, ఈ తైమూరునే, ఏంచెప్పానో జ్ఞాపకం తెచ్చుకోండి "ఓయి బయేజిద్! దేవుడిముందు ఈ దేశాలకూ ఈ మనుషులకూ ఏమాత్రం గౌరవం లేదు చూడు: ఏకాక్షివి నువ్వు; కుంటివాణ్ణి నేను – మనలాంటివాళ్ళం దేశాలను స్వాధీనం చేసుకుంటూవుంటే ఏమన్నా పట్టించుకున్నారా?" అన్నాను. ఆ గొలుసులతో బంధించబడి, వాటి బరువుకు తాళలేక తూలిపోతూ, బయేజిద్ నాయెదట నిలబడ్డప్పుడు నేనన్న మాటలు ఇవి! ఆ దౌర్భాగ్యస్థితిలోవున్న అతన్ని చూస్తూ అన్నమాటలు! అప్పుడు జీవితం అనేది శిథిలంలాగా కనిపించింది, కటిక చేదుగా తోచింది!

"దేవదూతనైన నేను, తైమూర్‌ను, ఏంచెప్పాలో, అదే చెబుతున్నాను! ఇక్కడ నాఎదుట ఒక స్త్రీ కూర్చొని వుంది! కోటిమందికి ఒక్కతె! ఆమె నా హృదయంలో నే నెన్నడూ ఎరగని అనేక భావాలను ప్రేరేపించింది. ఆమె తన తోటివాళ్ళతో మాట్లాడినట్లు నాతో మాట్లాడుతున్నది. దీనంగా వేడుకోటం లేదు. సాధికారంగా అడుగుతున్నది. ఇప్పుడు నాకు తెలుసు – ఆమె కింత శక్తి ఎక్కడిదో నాకర్థమైంది: ఆమెలో ప్రేమ వుంది, ఆ ప్రేమే ఆమెను ప్రబోధిస్తున్నది – తన బిడ్డలోవున్న ప్రాణికణం అనేక శతాబ్దాల జీవితాన్ని ఉజ్వలం చెయ్యగలదని! మహాప్రవక్తలందరూ ఒకప్పుడు చిన్న పిల్లలు కారా? మహావీరులంతా ఒకనాడు దుర్బల బాలురు కారా? ఓ జిహాంజీర్, నాకంటి

పాపా! బహుశః, జగత్తును వెలిగించటానికీ, సుఖమయం చెయ్యటానికీ నువ్వు పుట్టివుంటావు. నీ తండ్రినైన నేను ఈ జగత్తును రక్తసిక్తం చేసాను!"

ఆ జగద్విజేత మళ్ళీ క్షణం మౌనముద్ర వహించాడు. చివరకు ఇలా తన నిశ్చయం వెలిబుచ్చాడు.

"దేవమాతనైన నేను, తైమూర్‌ను, ఏం చెప్పవలసి వుందో, అదే చెబుతున్నాను! వెంటనే మూడువందల మంది రౌతులు నేల నాలుగు చెరగులకూ బయలుదేరాలి! ఈ యమ్మ బిడ్డను వెతికి తీసుకురావాలి! అంత దాకా ఈమె ఇక్కడే వేచి వుంటుంది. నేనూ ఎదురు చూస్తుంటాను. ఆ బిడ్డను ఎవరు తీసుకు వస్తారో వారిది అదృష్టం! ఈ మాట్లాడేది నేను! సమ్రాట్ తైమూర్‌ను! ... ఏ మమ్మా, నేను సబబుగా మాట్లాడానా?"

ఆమె, మొహం మీద పడుతున్న నల్లటి జుట్టును వెనక్కి విసరుతూ, అతన్ని చూసి నవ్వి, జవాబు చెప్పింది:

"ఔను, రాజా, మాట్లాడావు!"

అంతట ఆ భీకరుడైన వృద్ధుడు లేచి ఆమెకు నమస్కరించాడు. ఆనందమూర్తి, కవి కెర్మానీ మహోత్సేకంలో ఆలపిస్తున్నాడు:

"చుక్కలా పూర్వాల పాటల
కంటె చక్కని దేదిరా?
ఎల్లరెరుగుదురీ రహస్యం:
ఇదియె ప్రేమపు పాటరా!

అలనసంత నవాతపమ్మున
కంటె చక్కని దేదిరా ?
తన వరించిన తన్వియే అని
ప్రేమికుడు వచియించురా !

" అర్ధరాత్రిరి ఆకసమ్మున
చుక్కలా చక్కందనాలు,
ఎండకాలపు నడిమి మింటను
సూర్యునీ శృంగారమోహాల్ !

కాని నాప్రియకలికి కన్నులు
పూలకంటే చక్కనా !
కాని నాప్రియ లేతనవ్వులు
కాంతికంటే మెత్తనా !

" పాటలన్నిటికంటె చక్కని
పాటపాడని లేదురా :
అఖిలలోకారంభ కారిణి,
విశ్వహ్లాదయిని, దివ్యహ్లాదయిని,
మాతృదేవిని గూర్చి చక్కని
పాటపాడని లేదురా :

పాటలన్నిటికంటె చక్కని
పాటపాడని లేదురా !

ఆ అజేయప్రాణవాహిని
మాతృదేవిని పొగడరా!
పాటలన్నిటికంటె చక్కని
పాట ఇదియే, పాడరా!"

"ఓహో! కెర్మానీ, భగవంతుడు తన విజ్ఞానాన్ని ప్రచురించటానికి నీ పెదవుల్ని ఆశ్రయించటంలో పొరపాటు లేదు!" అన్నాడు తైమూర్, మహాకవితో.

"భగవంతుడు తానే ఒక మహాకవి!" అన్నాడు తాగివున్న కెర్మానీ.

ఆమె నవ్వింది. రాజులూ, యువరాజులూ దళాధిపతులూ అందరూ నవ్వారు. ఆమెవంక చూసినప్పుడు వారందరూ పసిపాపలే — ఆమె మాతృదేవి!

ఇదంతా నిజం; ఇక్కడ చెప్పిన ప్రతిమాట సత్యం;— ఇది మన తల్లులకు తెలుసు - వాళ్ళనడగండి చెబుతారు:

"నిజం, ఇది అనంత సత్యం; మృత్యువు కతీతమైన శక్తి మాది! సర్వదా జగత్తులోకి మహాకవుల మహర్షుల మహావీరుల నడిపే మేము, మానవుణ్ణి మహాత్ముణ్ణిచేసే సర్వం సమకూర్చే మేము చావుకు అతీతులం! మృత్యువు కతీతమైన శక్తి మాది!"

# 6

# వీ ర మా త

తల్లులను గూర్చి ఇలా అనంతకాలం కీర్తించవచ్చు. మరో తల్లి కథ వినండి :

పట్టణంచుట్టూ ఉక్కుగోడ పెట్టినట్లు, అనేక వారాలుగా, శత్రుసేనలు ముట్టడించి వున్నాయి. రాత్రిళ్ళు శత్రుశిబిరం వద్ద మండే అఖండాలు, రక్తాక్షిసహస్రాలవలె, ఆ కటికచీకటి తెరల్లోంచి నగరఉద్యానాలమీద దృష్టి సారించుతున్నాయి. దుష్టవాంఛల్లాగా పడగవిప్పిన అగ్నినాలుకలు చుట్టుముట్టబడిన ఆ నగరవాసుల్లో దుర్భరవిషాదం రేకెత్తిస్తున్నాయి.

పట్టణం గోడలమీదనుంచి చూస్తే-శత్రువు వేసిన ఉచ్చు నానాటికీ బిగిసిపోవటం కనిపిస్తున్నది ; ఆ అఖండాల చుట్టూ తిరిగే నల్లటి నీడలు గోచరిస్తున్నాయి. ఆ పారసీ గుర్రాల సకిలింపులూ, ఆయుధాల కలకలం, విజయవిశ్వాసం చేకూరిన శత్రుశిబిరంలోని అట్టహాసాలూ, సైనిక గీతాలూ నగరంలోకి వినిపిస్తున్నాయి. శత్రువుల సంగీతంకంటే, వికటాట్టహాసంకంటే కర్ణకఠోరమైంది ఏముంటుంది ?

నగరానికి మంచి నీరు తెచ్చే నదు లన్నింటిలోనూ, శత్రువు, శవాలను వదిలేసాడు. కోటగోడ చుట్టూవున్న

ద్రాక్షతోటల్ని తగలబెట్టాడు. పంటపొలాలను ధ్వంసంచేసాడు. పళ్ళతోటలు నరికేసాడు. ఇప్పుడు పట్టణం ఎటూ మదుగు లేకుండావుంది. ఇంచుమించూ ప్రతిరోజునా శత్రు ఫిరంగులూ తుపాకులూ నగరంమీద ఇనుమూ సీసం కురిపిస్తున్నాయి.

యుద్ధాలతో అలిసిపోయి, అర్ధాకలితో శోషిల్లుతూ ఆ నగరం ఇరుకువీధుల్లో సైనికులు గస్తీ తిరుగుతున్నారు. గాయపడ్డవారి మూలుగులూ, భయోన్మత్తుల పెడబొబ్బలూ, స్త్రీల ప్రార్థనలూ, పిల్లల ఏడుపులూ కిటికీల్లోంచి బయట పడుతున్నాయి. జనం గుట్టు చప్పిడిగా మాట్లాడుకుంటున్నారు. ప్రతిక్షణం జాగర్తే: ఆ వచ్చేది శత్రువు కాదుగదా ?

రాత్రిళ్ళు మరీ దుస్సహంగా వున్నాయి. ఆ నిశీథ నిశ్శబ్దంలో ఏడుపులూ పెడబొబ్బలూ మరీ స్పష్టంగా వినిపిస్తున్నాయి. దూరానవున్న పర్వతశ్రేణినుంచి నల్లటి నీడలు అర్ధ శిథిలాలుగావున్న నగరకుడ్యాల మీదకు పరచుకొని, శత్రు శిబిరాన్ని కనుమరుగుగా దాచిపెడుతున్నాయి. ఆ నల్లని నగ శిఖరాలమీద పొడిచిన చంద్రుడు, కత్తిగాట్లు తిన్న డాలు లాగా, వున్నాడు.

సహాయం వస్తుందన్న తమ ఆశలన్నీ నిరాశలై, ఆకలికీ అధికశ్రమకూ ఆహుతులై, విముక్తిపొందేఆశ నానాటికీ నశించిపోతూ – నగరవాసులు – ఆచంద్రుడివంకా, ఆ కొండల కరాళదంష్ట్రాశిఖరాలవంకా, ఆ నల్లటి కొండచరియల వంకా, కోలాహలంగావున్న ఆశత్రుశిబిరంవంకా భయోత్పాతంగా చూస్తున్నారు. ప్రతిదృశ్యమూ వాళ్లకు మృత్యువును

జ్ఞప్తికి తెస్తున్నది. కాని, వాళ్లకు తృప్తినిచ్చే నక్షత్రం ఒక్కటి కూడా ఆకాశంలో కనిపించటంలేదు.

ఇళ్లల్లో దీపాలు వెలిగించుకోటానికి కూడా వాళ్లు భయపడ్డారు. వీధుల్ని చీకటి కప్పేసింది. ఆ కటికచీకట్లో, నదీ గర్భాన సంచరించే మహామత్స్యంలాగా, ఒక స్త్రీ, పైనుంచి క్రిందికి నల్లటిముసుగుకప్పుకున్న స్త్రీ, నిశ్శబ్దంగా నడుస్తున్నది.

ఆమెను చూడగానే జనం ఒకరికొకరు కూడబలుక్కున్నారు :

"ఆమేనా ?"

"ఆమే !"

ఆమెకు ఎదటబడకుండా గడపల్లోకి తప్పుకునేవాళ్ళు, తలవంచుకుని గబగబా దాటిపొయ్యేవాళ్ళూ - అంతా అంతే ! గస్తీదళాలవాళ్ళు ఆమెను గట్టిగా హెచ్చరించారు :

"మేరియానా ! మళ్ళీ తిరుగుతున్నావా ? నిన్నెవరో చంపేస్తారు, జాగ్రత్త ! మళ్ళీ కనుక్కునేవాళ్ళుండరు !"

ఆమె నిటారుగా నిలబడి, ఎందుకోసమో నిరీక్షిస్తున్నది. ఆమెమీదికి చెయ్యి ఎత్తటానికి ధైర్యం చాలకగానీ, ఇష్టంలేకగానీ, గస్తీదళంవాళ్ళు చూస్తూ వెళ్ళిపోయారు. సైనికులామెను శవాన్ని చూసినట్టు అసహ్యంగా చూసి, ఆ చీకటిలో ఒంటరిగా వదిలేసారు. నగర దౌర్భాగ్యం మూర్తి కట్టినట్టు నల్లగా ఆమేరియానా వీధివీధికీ నిశ్శబ్దంగా తిరుగుతున్నది. ఆమెచుట్టూ, ఆమెను చుట్టుముట్టుతున్నట్టు విషాద స్వరాలు : మూలుగులు, ఏడుపులు, ప్రార్థనలు, విజయోత్సవపరిచిన సైనికుల గుసగుసలు.

ఆ పౌరుసాలు, ఆ తల్లి - మేరియానా తన కొడుకునూ, తన దేశాన్నీ తలచుకున్నది. తన నగరాన్ని ధ్వంసం చేస్తున్న వారికి అధినాయకుడు తన కొడుకు; - చక్కదనం, ఉత్సాహం ధైర్యం - అన్నీ వున్నాయి. తాను తన దేశానికి సమర్పించిన అమూల్యరత్నం ఆ కుమారుడే ననీ, తానూ తన కొడుకూ ఏ ప్రజలమధ్యపుట్టి పెరిగారో ఆ ప్రజలకు సహాయకంగా తాను సమకూర్చిపెట్టిన కొత్తబలం ఆ కుమారుడేననీ - ఆమె అతన్ని గర్వంగా చూసుకొని ఎంతో కాలం కాలేదు. ఈ నేల మీది రాళ్ళతోటే తన ముత్తాతలు ఇళ్ళు కట్టుకున్నారు, కోట గోడలు లేపారు; ఈ నేలలోనే తన రక్తబంధువులంతా ఇంకా నిద్రిస్తున్నారు; ఇక్కడి పాటలే తన ప్రజల ఆశా విశ్వాసాల్ని ప్రకటిస్తున్నాయి - ఇదే తన నేల! ఇక్కడి ప్రతి రాతితోను, ప్రతి మృత్తికతోను, ప్రతి పాటతోను, ప్రతి ఆశతోను తన హృదయానికి సంబంధం వుంది - కాన రాని అనేక బంధాలు తన హృదయాన్ని ఈ భూమికి కట్టి వేస్తున్నాయి. ఇప్పుడీ హృదయం తాను ప్రేమించిన ఒక వ్యక్తిని పోగొట్టుకొని, దుఃఖిస్తున్నది. తన పుత్రప్రేమనూ దేశభక్తినీ ఆమె హృదయంలో తూచుకున్నది. కాని, ఏది మొగ్గో తెల్చుకోలేదు.

అందువల్ల ఆమె రాత్రిపూట వీథులవెంట తిరుగుతున్నది. కొంతమంది ఆ చీకటిలో ఆమెను చూసి గురుపట్టక, తమందరికీ సమీపంలోనే వున్న మృత్యుదేవతేమో అనుకొని, భయంతో పారిపోయారు. గుర్తించినవాళ్ళు ఆ ద్రోహితల్లి ఎదటినుంచి నిశ్శబ్దంగా ముఖాలు తప్పించారు.

కాని, ఆమె ఒకనాడు – నగరంలో ఒక మారుమూల– ఒకశవం ప్రక్కన మోకరిల్లి మట్టిపోగులాగా నిశ్చలంగా కూర్చొని, ఆ దుఃఖాచ్ఛాదితమైన ముఖాన్ని చుక్కలవైపు తిప్పి, ప్రార్థిస్తున్న ఒక స్త్రీని చూసింది. ఆదగ్గరలో, గోడలదగ్గిరున్న సైనికులేదో గుసగుసలాడుతున్నారు. వారి ఆయుధాలు రాళ్లకు రాచుకుంటున్నశబ్దం అవుతున్నది.

ఆ కూర్చొనివున్న స్త్రీదగ్గిరికి వచ్చి ద్రోహితల్లి మేరియానా ప్రశ్నించింది :

"నీ భర్తా ?"

"కాదు."

"నీ సోదరుడా ?"

"నాకొడుకు. పదమూడురోజులక్రితం నాభర్తను చంపారు. ఇవాళ నాకొడుకు!" అని లేచి నిలబడుతూ, ఆ స్త్రీ, "మడోనాతల్లి అన్నీ చూస్తున్నది, ఆమె కన్నీ తెలుసు! నేనామెను నమ్ముకున్నాను!" అంది.

"ఎందుకోసం ?"

"ఎందుకోసమా ? ఇప్పుడు నా కొడుకు తన మాతృదేశంకోసం పోరాడి, వీరమరణం చెందాడు కనుక, నేను చెప్పగలను. మొదట్లో నేను భయపడ్డమాటనిజం – తేలికమనస్సూ, ఉబలాటం :వాణ్ణి ఎక్కడికి తీసుకుపోతాయోనని భయపడ్డాను. వాడుకూడా శత్రుమూకల్లో చేరి, దేశానికీ దైవానికీశత్రువై, మేరియానా కొడుకులాగా దేశద్రోహి అయిపోయి – తాను నాశనం కావటమేకాక, కన్నకడుపు కూడా కాల్చివేస్తాడేమో నని భయపడ్డాను"

మేరియూనా, ముఖానికి చేతులు కప్పుకొని, వెళ్ళి పోయింది. ఆ మరునాటి ఉదయం నగర రక్షకులను కలుసుకొని చెప్పింది :

"నా కొడుకు మీకు శత్రువైనాడు. మీరు నన్ను చంపండి; లేదా, వాడి దగ్గిరికి పోవటానికి నాకు కోట తలుపులు తెరవండి!"

"నీవూ మనిషివే. నీకుకూడా నీ దేశం అమూల్యమైందే. మాలో ప్రతిఒక్కరికీ నీ కొడుకు ఎంత శత్రువో, నీకు కూడా అంతే" అన్నారు నగర రక్షకులు.

"నేను వాడి తల్లిని. వాణ్ణి ప్రేమించాను. వాడి నేరానికి బాధ్యత అంతా నాదేనని అనుకుంటున్నాను."

నగర రక్షకులు ఒకరి నొకరు సంప్రదించుకొని చెప్పారు :

"నీ కొడుకు పాపానికి నిన్ను చంపటం మర్యాదకాదు. ఈ భయంకర నేరం చెయ్యటానికి నువ్వు వాణ్ణి పురికొల్పివుండవనీ, నీవలాంటిది చెయ్యలేవనీ మాకు తెలుసు; నీ బాధకూడా తెలుసు. నిన్ను చూపి నీకొడుకును బెదిరించ గలమని కూడా నగరవాసు లనుకోటం లేదు. నువ్వు ఏమైనా, వాడు లక్ష్యం చెయ్యడు. ఆ నీచుడు నిన్ను మరచిపోయేవుంటాడు. కాని, నీకు ఉచితమైనదనుకుంటే, నువ్వే కోరుకున్న శిక్షవుంది! అది చావుకంటె భయంకరంగా ఉంటుందని మా నమ్మకం!"

"ఔను. నిజానికి, అంతే!" అన్నదామె.

కనుక, ఆప్రకారం, కోట తలుపులు తీసి ఆమెను పోనిచ్చారు. ఆమె తల్లినేల వదిలి, తన కొడుకు చిందించిన

రక్తపుమడుగుల్లోంచి పోతూంటే - కోటకొమ్మలమీదినుంచి నగరరక్షకులు చాలాసేపు చూస్తూ నిలబడ్డారు. ఈ నేల నుంచి దాటిపోవటానికి తనకాళ్ళు నిరాకరిస్తున్నట్లుగా ఆమె నిదానంగా నడిచిపోతున్నది. పడివున్న నగరరక్షకుల శవాలకు ప్రణమిల్లుతున్నది. కాలి కడ్డంవచ్చిన ఆయుధాల తుంపులను ప్రక్కకి తన్నివేస్తున్నది. తల్లులకు మారణాయుధాలన్నీ దుస్సహాంగానే వుంటాయి. రక్షకశక్తుల్నిమాత్రమే మాతృదేవతలు గుర్తిస్తారు.

ఆమె తన ఉడుపుల్లో ఏదో తీర్థపాత్రిక దాచిపెట్టుకు పోతున్నట్లుగా, ఆ జలం ఎక్కడ తొణుకుతుందో నన్నంత నెమ్మదిగా నడిచిపోతున్నది. కోటమీదినుంచి చూసేవాళ్ళకు క్రమంగా ఆమె రూపు చిన్నది చిన్నదైపోతుంటే, తమ నిస్పృహావిచారాలు కూడా ఆమెతోపాటు దూర దూరమై పోతున్నట్లని పించింది.

ఆమె సగందూరంలో ఆగి, వెనుదిరిగి, చాలాసేపు నగరంవంక చూడటం అందరూ చూసారు. ఆతర్వాత శత్రుశిబిరంలో ఆ పొలంలో ఆమె ఒంటరిగా నిలబడివుండగా, శత్రుసైనికులు జాగ్రత్తగా ఆమె దగ్గరకు రావటంకూడా కనిపించింది. శత్రుసైనికులు ఆమెను సమీపించి - ఎవరో, ఎక్కడినుంచి వచ్చిందో - అడిగారు.

"నాకొడుకే మీ అధినేత" అని ఆమె చెప్పినప్పుడు, ఆ సైనికుల్లో ఒక్కరూ అనుమానించలేదు. వాళ్ళు ఆమె ప్రక్కన బారుతీరి నిలబడి, అతని కీర్తి ప్రతిష్టల్ని గానంచేస్తూ అతను ఎంత సాహసవంతుడో ఎంత తెలివైనవాడో వర్ణిస్తు

న్నారు. తన కొడుకు మరోవిధంగా ఉండటానికి వీలులేదు కనుక, ఆమె సగర్వంగా తలెత్తి, అన్నీ విన్నది.

ఇప్పుడు ఆమె తన కొడుకు ఎదుట నిలబడివుంది. అతని పుట్టుకకు తొమ్మిది నెలల పూర్వంనుంచే ఆమె అతన్ని ఎరుగును. అతను తన హృదయంనుంచి భిన్నమైనవాడనికూడా ఆమె ఎన్నడూ అనుకోలేదు. ఆ పీతాంబరాల మీద రత్నఖచితమైన ఆయుధాలు ధగధగలాడుతూ అతను నిలబడి వున్నాడు. అంతా ఉండవలసిన విధంగానే వుంది; అతను అలా ధనంతో, కీర్తితో, ప్రతిష్టతో ఆ తల్లికి ఎన్ని స్వప్నాల్లోనో కనిపించాడు.

అతను ఆమె చేతులు ముద్దు పెట్టుకుంటూ అన్నాడు :

"తల్లీ! నువ్వు నా దగ్గిరికి వచ్చావు. ఇక భయం లేదు. రేపే ఈ దిక్కుమాలిన పట్టణాన్ని పట్టుకుంటాను!"

"నిన్ను కన్న పట్టణం..." అని జ్ఞాపకం చేసింది తల్లి.

సాహసం కళ్ళకు ఎగగమ్మి, కీర్తిదాహం పెచ్చు పెరిగిన యౌవనపు వేడిలో అతను అహంకారంతో తల్లికి జవాబు చెప్పాడు :

"నేను ఈ జగత్తుకోసం, జగత్తులో జన్మించాను. నా పేరు వింటేనే ఈ జగత్తంతా గడగడలాడేట్టు చెయ్యాలని నా సంకల్పం! నీ కోసం నేను ఈ పట్టణాన్ని చూస్తూ ఊరుకోవలసి వచ్చింది. ఈ నగరం నా కండల్లో గుచ్చుకున్న ముల్లులాగా, నా ప్రఖ్యాతికి ప్రతిబంధకంగా వుంది. రేపే ఈ దుష్ట రాటాన్ని ఛేదిస్తాను!"

"అక్కడ నేలమీదవున్న ప్రతిరాతికీ చిన్నప్పుడే నువ్వు

పరిచయమైనావు. ఇంకా అవన్నీ నిన్ను జ్ఞాపకంపెట్టుకొనే వున్నాయి. అలాంటి నగరం అది!"

"మనిషి మాట్లాడించక పోయినట్లయితే, రాళ్లకు నోరు లేదు. ఈ కొండలన్నీ నన్ను గురించి చెప్పాకోసి! అదే నా కోరిక!"

"మనుషుల మాటేమిటి?"

"ఔను. నేను మనుష్యుల్ని మరచిపోలేదు. నాకు మనుషులు కావాలి. మనుష్యుల జ్ఞాపకాల్లోనే వీరులు అమరులవుతారు!"

అయితే వీరులెవరో ఆతల్లి చెప్పింది:

"మృత్యువును ప్రతిఘటించి ఎవడు జీవితాన్ని నిర్మిస్తాడో, ఎవడు మృత్యువును జయిస్తాడో — వాడే వీరుడు..."

కొడుకు అంగీకరించలేదు:

"కాదు. ఒక నగరాన్ని నిర్మించినవాడికి ఎంతప్రఖ్యాతి వస్తుందో, దాన్ని ధ్వంసంచేసినవాడికి కూడా అంత ప్రఖ్యాతి వస్తుంది. చూడు, రోముపట్టణాన్ని యానీస్ నిర్మించాడో రోములస్ నిర్మించాడో మనకు తెలీదుగదా! అయినా, రోమును ధ్వంసంచేసిన అలరిక్ మొదలైన వీరులందరిపేర్లూ మనకు తెలుసు!"

"ఈ అన్నిపేర్లనూ దాటి రోము నిలిచేవుంది!" అని హెచ్చరించింది తల్లి.

ఈవిధంగా తల్లీకొడుకులు సూర్యాస్తమయందాకా తర్కించుకొంటూనేవున్నారు. అతని ఉద్రిక్తవాగ్ధోరణిని ఆమె అప్పుడప్పుడుమాత్రమే చాలా అరుదుగా అడ్డగిస్తూ

వచ్చింది. ఆమె గర్వోన్నతమైన శిరస్సు మరీమరీ కుంగి పోతూవచ్చింది.

తల్లి సృష్టిస్తుంది, రక్షిస్తుంది; ఆమెతో విధ్వంసాన్ని గురించి మాట్లాడడమంటే ఆమెకు వ్యతిరేకంగా మాట్లాడటమే! ఇది అతనికి తెలేదు. ఇంతేకాదు, ఆమె చెప్పే జీవిత సూత్రాన్నే తాను వ్యతిరేకిస్తున్నట్టుకూడా అతనికి తెలేదు.

తల్లి ఎల్లప్పుడూ మృత్యువుకు బద్ధశత్రువు. మానవ మందిరాల్లోకి మృత్యువును తీసుకొచ్చే శక్తుల్ని ప్రతి తల్లీ ద్వేషిస్తుంది; శత్రుత్వం వహిస్తుంది హృదయాన్ని చంపే కీర్తి తళుకులకు కన్నులు కానక, ఆకొడుకు ఈ సత్యాన్ని గమనించలేదు.

తాను కని పెంచిన జీవితం ధ్వంసంకాబోతున్నప్పుడు, తల్లి, ఎంత నిర్భయంగా ఎంత తెలివిగా ఎంత నిర్దాక్షిణ్యంగా ప్రతిఘటిస్తుందో కూడా అతనికి తెలేదు!

ఆమె తలవంచి కూర్చొని, తన కొడుకు చక్కాని గుడారం ద్వారంనుంచి నగరంవంక చూసింది. ఆ నగరంలోనే ఒకప్పుడు తనలో ఒక ప్రాణి కిరణం కదలాడింది; ఆ నగరంలోనే, ఇప్పుడు దాన్ని ధ్వంసం చెయ్యబూనుకున్న ఈ శిశువు కోసం, తాను ప్రసవ వేదన పడ్డది.

నగర శిఖరాలమీది ఎర్రటి సూర్యకిరణాలు రక్తం అద్దినట్లున్నాయి. కిటికీ తలుపులు రక్తం కక్కుతున్నట్టు మెరుస్తున్నాయి. పట్టణమంతా గాయాలమయం అయినట్లూ, ప్రతిచోటా జీవరక్తం కాలువలు కట్టుతున్నట్లూ కనిపించింది.

వెంటనే పట్టణం శవంలా నల్లపడి పోయింది; తలకొరువుల్లాగా నక్షత్రాలు మిలమిల్లాడు తున్నాయి.

శత్రువును ఆకర్షించకుండా వుండటం కోసం దీపం పెట్టని చీకటి కొంపలు కనిపిస్తున్నాయి. దుఃఖంతో కుంగిపోయి, శవదుర్గంధంతో తడిసిన పురవీధులు కనిపిస్తున్నాయి. చావుకై ఎదురు చూస్తున్న ప్రజల అస్పష్టరహస్యసంభాషణలు వినిపిస్తున్నాయి. ఆమెకుఅన్నీ, ప్రతిఒక్కటీకూడా, కనిపిస్తున్నాయి అదంతా ఆమెకు సన్నిహితంగా ప్రియతమంగా అక్కడ నిలబడి మౌనంగా ఆమె నిశ్చయంకోసం ఎదురు చూస్తున్నట్టున్నది. తన నగరంలో వున్న ప్రజలందరికీ తానే తల్లిననే భావం ఆమెలో పొడసూపుతున్నది.

నల్లటి నగ శిఖరాలనుంచి మేఘాలు లోయల్లోకి దిగి, అక్కడినుంచి రెక్కల గుర్రాల్లాగా, ఆ దురదృష్ట నగరం మీాదికి దూకాయి.

"తగినంత చీకటిగా వుంటే బహుశః ఈరాత్రి మనం దాడి చెయ్యవచ్చు! ఎండ ప్రకాశవంతంగా వుండి, ఆయుధాల తళతళలు మన కళ్ళల్లో గుచ్చుకుంటున్నప్పుడు చంపటం కష్టం. అనేక దెబ్బలు వృథాగా గురితప్పిపోతాయి!" అన్నాడు కొడుకు, కత్తి చూసుకుంటూ.

తల్లి కోరింది:

"రా, బిడ్డా! నా ఒడిలో తలపెట్టి, కొంచెంసేపు కళ్ళు మూసుకొని, విశ్రాంతి తీసుకో! చిన్నప్పుడు నువ్వు ఎంత దయగా ఎంత సంతోషంగా వుండేవాడివో జ్ఞాపకం

తెచ్చుకో! నిన్ను అంతా ఎంత ప్రేమించేవారో జ్ఞాపకం చేసుకో!..."

"నన్ను ఇంతవాణ్ణి చేసినందుకు నిన్ను ప్రేమిస్తాను; కీర్తిని ప్రేమిస్తాను!" అంటూ, అతను తల్లి ఒడిలో తలమార్చి విధేయంగా కళ్ళు మూసుకున్నాడు.

ఆమె అతనిమీదికి వంగుతూ, "మరి స్త్రీలను ప్రేమించవా?" అని అడిగింది.

"వాళ్ళు అనేకమంది. మరీ తీపివస్తువులు మొహం కొట్టినట్లుగా, స్త్రీలంటే విసుగు పుడుతుంది."

"నీకు పిల్ల లక్కరలేదా?" అని చిట్టచివరిసారిగా అడిగింది.

"ఎందుకు? ఎవరిచేత నన్నా చంపించటానికా? నావంటి వా డెవడో వాళ్ళను చంపుతాడు; అది నాకు చాలా బాధగా వుంటుంది. కాని అప్పుడు నేను శత్రువుమీద ప్రతీకారం చెయ్యటానికి చాలనంత దుర్బలంగా వృద్ధాప్యంలో వుంటానేమో!"

"నువ్వు చక్కనివాడివే; కాని కాంతి కిరణంలాగా నిస్సారమైనవాడివి!" అన్నది తల్లి నిట్టూరుస్తూ.

"ఔను, కాంతికిరణంలాగా..." అన్నాడు నవ్వుతూ కొడుకు.

ఆ తల్లి ఒళ్లో పసిపిల్లవాడిలాగా అతను నిదుర మైకంలో పడిపోయాడు.

తర్వాత, అతని ముఖానికి తన నల్లటికొంగు కప్పి, అతని గుండెల్లో ఆమె బాకు దించేసింది. తన కొడుకు గుండె ఎక్కడ

ఆడుతుందో ఆమెకంటే ఎవరికెక్కువ తెలుసు ? ఒక్కదెబ్బకు అతను మరణించాడు. ఆశ్చర్యచకితులైన పహారావాళ్ల కాళ్లకింది కి తన కొడుకుశవాన్ని నెట్టేసి, ఆమె నగరప్రజను ఉద్దేశించి ఇలా అన్నది :

"ఒక పౌరురాలుగా, నా దేశానికి నేను చెయ్యగలిగిందల్లా చేసాను. కాని, తల్లిగా నా బిడ్డతోనే ఉండిపోతాను. మళ్లీ జీవం ధరించగలశక్తి నాలో ఎప్పుడో ఉడిగిపోయింది. ఇక నాజీవితం ఎవరికీ ప్రయోజకమైంది కాదు."

అతని రక్తంతో, అంటే తన రక్తంతోటే, ఇంకా నులివెచ్చగావున్న ఆ కత్తి పైకెత్తింది; తనహృదయంలోకి దింపేసుకున్నది - బలంగా; మళ్లీ మరోసారి...

వేదనామయమైన హృదయంలో సాహసం అసహజం కాదు గదా !

# 7

# తుది సందేశం

---

తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి.

ఆ దట్టమైన ఆలివ్ చెట్ల గుబురుల మధ్య బలిష్టమైన లోహతంత్రులు అమర్చినట్లుగా వుంది. గాలి కెరటాల్లో తూగాడే ఆలివ్ పత్రాలు, ఆ తీగెలను మీటుతూ, వాతావరణమంతా ఆ వింత సంగీతంతో నిరంతరంగా నింపుతున్నాయి. అది నిజంగా సంగీతం కాదు. కాని, ఏవో అదృశ్య హస్తాలు కానరాని వందల తంబురాలను మీటుతూ శృతి చేస్తున్నట్లుగా వుండి, ఎప్పుడో హఠాత్తుగా ఆ శృతి ఆగిపోయి, సూర్యుణ్ణి గురించో, ఆకాశాన్ని గురించో, సముద్రాన్ని గురించో, ఒక అద్భుత సంగీతం వినవచ్చేటట్లు ఆశావహంగా వుంది.

తరంగితమైన తమ కిరీటాలు పర్వతాలనుంచి సముద్రందాకా కదలాడే విధంగా, ఆ ఆలివ్ చెట్లను ఊయెలలూపుతూ, గాలి వీస్తున్నది. సముద్రపు నురుసు ఆ శిలాతీరానికి మందంగా ఒక స్థాయిలో కొట్టుకుంటున్నది. సముద్రం జీవ కోటికి ఉనికిపట్టు ఆ సముద్రపు నీలి మైదానం మీద వాలిన పిట్టలపిండులాగా, అన్నీ ఒకే వైపుకు ప్రయాణంచేస్తూ, లోతుల్లోకి అదృశ్యమౌతూ, మళ్ళీ కెరటం విచ్ఛిన్నధ్వనుల్లో పైకి లేస్తూ - దట్టంగావున్న ఆ నురుసులు

తమాషాగా కనిపిస్తున్నాయి. వాటిని దూరంగా వెనక్కు పిలుస్తున్నట్టుగా, సముద్రం ఆకాశం కలిసినచోట ముత్తెరలెత్తుకున్న రెండు పడవలు, రెండు బూడిదరంగు పిట్టల్లాగా, అటూ ఇటూ తచ్చాడుతున్నాయి. ఆ దృశ్యమంతా, సగం మరచిపోయిన పాత కలలాగా, అవాస్తవికంగా వుంది.

ఆ గులకరాళ్ళ బీచిమీద కొండనీడలో కూర్చొని వున్న ఒక ముసలి పల్లెవాడు చెప్పాడు.

"ప్రొద్దుకుంకేసరికి ఇ - ళ గాలి లేస్తుంది!"

సముద్రపు అలలతో కొట్టుకొనివచ్చి, తీరాన గులకరాళ్ళమీద, వెదజిమ్మినట్లు, పడివున్న గడ్డి మొక్కలు కొన్ని తుప్పురంగుగాను, కొన్ని బంగారువర్ణంగాను, మరికొన్ని ఆకుపచ్చగాను వున్నాయి. ఆ మండుటెండలో కాలుతున్న రాళ్ళమీద ఆగడ్డిమొక్కలమీగనుంచి లేచే ఆవిరి 'అయొడిన్' వాసన కొడుతున్నది. వంపులువంపులుగా వున్న కెరటాలు ఒకదాన్నొకటి ఒడ్డుకు తరుముకొస్తున్నాయి.

ఆ వడలిపోయిన ముఖం, పొడుగాటి ముక్కు, ఆ నల్లటి చర్మపు ముడతల్లో దాగిన నిశితమైన గుండ్రని కళ్ళూ చూస్తే – ఆ ముసలి పల్లెవాడు సముద్రతీరాన కూర్చున్న పిట్టలాగా వున్నాడు; ఆ వంకరలు తిరిగి, ఎండిపోయినట్లున్న వేళ్ళు మోకాళ్ళమీద చలనంలేకుండా పెట్టుకున్నాడు. తుమ్మెదల ఝుంకారానికీ, కెరటాల తటపటలకూ శ్రుతి కలిపే స్వరంతో అతను తన చరిత్ర చెప్పటం ప్రారంభించాడు.

"యాభై యేళ్ల పూర్వం ఒకరోజు ఇలాగే బాగా ఎండ కాసిన రోజు – ఇంకా నాకు బాగాజ్ఞాపకం–ఆరోజు, కనిపించే

ప్రతివస్తువూ నవ్వుతూ పాడుతున్నట్లుండి. అప్పుడు నాతండ్రికి నలభై యేళ్లుంటాయి. నేను పదహారేళ్ల వాణ్ణి. ఉష్ణప్రదేశాల్లో నివసించే ఆవయసు వాళ్లందరిలాగానే, నేనుకూడా అప్పటికే ఒక ప్రేమకలాపంలో వున్నాను.

"ఆనాడు మానాన్న 'రా, గుయ్‌డో! వెళ్లి పెజ్రోనీలు పట్టుకొద్దాం' అని పిలిచాడు. పెజ్రోనీ అంటే ఒకరకం చేప. ఎర్రటిరెక్కలుంటాయి. చాలా రుచిగా వుంటుంది. సముద్రంలో పగడపు కొండలున్నచోట్లనే అవి లోతుగా వుంటాయి కనుక వాటిని పగడపుచేపలనికూడా అంటారు. లంగరుదగ్గరనుంచోని, బలీయమైన గాలం వేసి దాన్ని పట్టుకోవాలి. చాలా చక్కని చేప!

"చాలాచేపలు చిక్కుతాయని తప్పితే, మరేమీ ఆలోచించకుండా బయలుదేరాము. నాతండ్రి బలవంతుడే, చేపలుపట్టటంలో బాగా అనుభవం వున్నవాడే; కాని, అంతకు పూర్వం కొద్ది రోజులక్రితమే జబ్బుపడ్డాడు. గుండె నొప్పిగా వుండేది. పల్లెవాళ్ళందరికీ వచ్చే నరాల జబ్బుతో ఆయన వేళ్లు కొంకర్లు పోయేవి.

"ఇప్పుడు ఇంత లాలనగా మనల్ని సముద్రంవైపు నెట్టుతున్నట్లు తీరంనుంచి వీచే ఈ గాలి చాలా చెడ్డది, విద్రోహకరమైందికూడా. దానికి మన మేదో పెద్దద్రోహంచేసినట్టుగా ఉండి ఉండి అజాగ్రత్తగా వున్నప్పుడు, ఒక్కసారి అకస్మాత్తుగా మనమీదికి విజృంభిస్తుంది. మన పడవను ఎత్తి అవతల పారేస్తుంది. ఒక్కొక్కప్పుడు మనల్ని నీళ్ళలో ముంచేసి, పడవను మనమీద బోర్లిస్తుంది. మన దుర్విధిని గురించి చింతించటానికి

గానీ, భగవంతుణ్ణి ధ్యానించుకోటానికి గానీ మనకు అవకాశం లేనంత వేగంతో, అదంతా హఠాత్తుగా జరిగిపోతుంది. అంతలో మనల్ని గింగిరాలు తిప్పుతూ ఎక్కడికో దూరానికి నిస్సహాయంగా తోసిపారేస్తుంది. ఈ గాలికంటె దొంగవాడు ఎక్కువ పెద్దమనిషి అంటాను. అసలు ఈ ప్రకృతి శక్తులకంటే మనుషు లెప్పుడూ నిజాయితీకలవాళ్ళే.

"అప్పుడు, సరీగా ఇలాంటి గాలే తీరానికి దగ్గరలోవున్న మమ్మల్ని రెండున్నర మైళ్ళలోపలికి కొట్టేసింది. అది కూడా, పిరికివాడిలాగానూ నీచుడిలాగానూ హఠాత్తుగా దొంగదెబ్బ తీసింది.

"ఆ మొలి తిరిగిపోతున్న చేతులతో నా తండ్రి, తెడ్డు మోపుగా పట్టుకొని, 'ఆపు, గుయ్‌డో! ఆపు! లంగరు వెయ్యి!' అని అరిచాడు.

"నేను లంగరు కోసం దేవులాడుతుండగా, గాలి విసురుగా వచ్చి నా తండ్రి చేతిలోని తెడ్డును ఎగర గొట్టేసింది. అది రొమ్మునకు కొట్టుకొని, ఆయన, పడవలో అడుగున పడిపోయాడు. ప్రతి క్షణం మేము ఆ కెరటాల్లో కలసిపోయే ప్రమాదం కళ్ళ యెదుట కనపడుతూ వుండటంవల్ల, నేను లంగరు వదిలిపెట్టి, ఆయన కేమీ సహాయం చెయ్యటానికి అవకాశం చిక్కలేదు. మొదట్లో ప్రతిదీ త్వర త్వరగా జరిగిపోయింది. తర్వాత నేను తెడ్లు స్వాధీనంలోకి తెచ్చుకునే సరికి, మేము లోపలికి కొట్టుకు పోతున్నాము. కెరటాల తలలు తుంపుకొన్న ఆ గాలి, మామీద చుట్టూ జల్లు కురిపిస్తున్నది. పురోహితుడు మనమీద మంత్రోదకం చల్లినట్టుగానే

అయితే అంతకంటే తీవ్రంగా జల్లుకొడుతున్నది. కాని అది మంత్రోదకమూ కాదు, మన పాపాలు క్షాళన చెయ్యటానికీ కాదు.

“నాతండ్రి మళ్ళీ తెలివి తెచ్చుకొని ‘ఇది ప్రమాదకరంగావుంది’ అని మళ్ళీ తీరంవంక చూసి ‘ఇది ఇప్పట్లో ఆగేది కాదు, చాలాసేపుంటుం’ దన్నాడు.

“‘నువ్వా వయసులో ఉన్నప్పుడు, ప్రమాదం వస్తుందంటే నీకు నమ్మకం వుండదు. నీకోసం వెయ్యి సమాధులు తవ్వుతూ, కూలి లేకుండా నీ మృత్యుగీతా లాలపించే ఈ సుడిగాలిలో, పిశాచాలు పీల్చివిడిచిన ఈ చెమగాలిలో, నావికుడైనవాడు ఇలాంటి క్లిష్ట సమయంలో చెయ్యవలసిందల్లా చేసాను; పడవను నిలబెట్టాలని చూసాను.

“‘కాని, గుయిడో నువ్వు శాంతంగా వుండు!’ అని తలమీది నీళ్ళు తుడుచుకుంటూ అన్నాడు. ‘నిప్పుపుల్లలతో సముద్రాన్ని ఎంత గుచ్చి ఏం ప్రయోజనం? అలిసిపోకుండా, నీ బలం కూడదీసుకో! లేకపోతే, ఇంటిదగ్గరవాళ్ళు నీకోసం వృథాగా ఎదురుచూసినవాళ్ళవుతారు!’

“పిల్లలు బంతిని ఊపివేసినట్టుగా, ఆ పచ్చటి కెరటాలు మా పడవను ఊపిపారేసాయి; పడవ అంచుల కెగబ్రాకి, మా తలలమీదికి లేచి, మమ్మల్ని అల్లల్లాడిస్తూ, హోరున అవతలికి దూకుతున్నాయి. మా పడవ ఆ అలలమధ్య ఎక్కడో అగాధంలో తూగాడుతున్నది. మళ్ళీ మరో కెరటం మమ్మల్ని తన తెల్లటి శిఖరంమీదికి చేర్చుకున్నది. అంతకంతకూ తీరం

మూకు దూరదూరంగా పరుగెత్తుతూ, మా పడవలాగానే నృత్యం చేస్తున్నట్లు కనిపిస్తున్నది.

"అప్పుడు నాతండ్రి అన్నాడు: "నువ్వు తిరిగి ఇంటికి చేరతావేమో కాని, నామాటమాత్రం వట్టిది. చేపలు పట్టటంలోనూ, పనిలోనూ నువ్వు తెలుసుకోవలసిన విశేషాలున్నాయి. విను, చెబుతాను!'

"ఏ ఏ రకం చేపల అలవాట్లు ఎలావుంటాయో, ఏ చేపను ఎక్కడ ఎప్పుడు ఎలా పట్టాలో చెప్పటం ప్రారంభించాడు.

"మాదురవస్థ అర్థం చేసుకున్నతర్వాత నేనన్నాను: 'మనం ఇప్పుడు దేవుణ్ణి తలచుకోగూడదా ?' అని. అన్నివైపులనుంచీ పంజాలువిప్పి మీదపడుతున్న తెల్లటి వేటకుక్కల మధ్యచిక్కిన రెండుకుందేళ్లలాగా వున్నాం మేమప్పుడు.

"తయన అన్నాడు: 'దేవుడు అన్నీ చూస్తాడు. ఈ భూమిమీద బ్రతకటంకోసం తాను సృష్టించిన ప్రాణులు ఇప్పుడు సముద్రంలో చావుకు సిద్ధంగావున్నారని దేవుడికి తెలుసు. అందులో ఒకడు, మరి జీవితాశలేనివాడు, తనకున్న విజ్ఞానాన్నంతటినీ తన కుమారుడికి అప్పగించాలని కూడా ఆయనకు తెలుసు. ఈ ప్రపంచానికీ ప్రజకూ పని అనేది అవసరం. ఈసంగతి ఆయన అర్థంచేసుకుంటాడు...'

"చేపలు పట్టటాన్ని గురించి తనకు తెలిసిందంతా చెప్పాక, ఒకడు తనతోటివాళ్లతో మంచిగా బ్రతకాలంటే ఏమిటి తెలుసుకోవాలో చెప్పాడు.

“‘ఇంటిదగ్గర నువ్వెన్నడూ చెప్పలేదు. ఇదేనా, నాన్నా, నాకు చెప్పేసమయం?’ అన్నాను.

“‘ఇంటి దగ్గర చావెప్పుడూ ఇంత సన్నిహితంగా ఉండదు గదా!’ అన్నాడు.

“గాలి అడివి జంతువులాగా గోండ్రు పెడుతున్నది. హోరున లేచే ఆ కెరటాల మ్రోతలో, తాను చెప్పేది నాకు వినిపించటంకోసం, నాన్న బిగ్గరగా అరచి చెప్పవలసి వచ్చింది:

“‘నీతోటి వాడితో, అల్లుడిలాగా గానీ, అధికుడిలాగాగానీ కాకుండా, ప్రవర్తించటం మంచిది! రాజూ పల్లెవాడూ, పురోహితుడూ సైనికుడూ—అందరూ ఒకే యంత్రంలోని భాగాలు. ఆ యంత్రానికి తక్కువవాళ్ళ అవసరం ఎంతో, నీ అవసరమూ అంతే! నువ్వు ఎవరిదగ్గరకైనా పోయ్యేటప్పుడు వాడిలో మంచికంటే చెడే ఎక్కువవున్నదనుకుంటూ పోకు! ఎప్పుడూ వాడిలో మంచే ఎక్కువ వున్నదని నమ్ము! అలా వుండి తీరుతుంది. నువ్వు ఎలా కోయితావో అలాగే ప్రవర్తిస్తారు మనుష్యులు!’

“నిజానికి ఈ మాటలన్నీ ఆయన ఒక్క వరసన చెప్పలేదు. మేము కెరటం నుంచి కెరటానికి క్రిందికి పడుతూ పైకి లేస్తూన్నప్పుడు, ఆ నీటి జల్లులోంచీ ఆ నురుసుల లోంచీ, ఆయన మాటలు ఒక్కటొక్కటే వినిపించాయి. కాని, ఆయన చెప్పినదాంట్లో చాలాభాగం నాకు వినిపించక ముందే గాలిలో కలిసిపోయింది. ఇంకా, చాలా నాకు అర్థం కానే లేదు. ముఖం ఎదుట మృత్యుదేవత తాండవిస్తున్నప్పుడు, ఎవడికైనా, ఏమి పట్టుబడుతుందికనుక! అంతకు ముందెన్నడూ

సముద్రం అంత భయంకరంగా వుండగా చూడలేదు, ఎన్నడూ సముద్రం మీద అంత నిస్సహాయంగా అనిపించలేదు- నిజంగా నాకు భయం వేసింది. అప్పుడో ఆ తర్వాతనో సరిగా గుర్తులేదు కాని, ఒక విషయం మాత్రం నేను జీవించి వుండగా మరవలేను.

"అది నిన్ననే జరిగినట్టుగా కళ్ళముందు మెదలుతుంది. ఆ పడవ అడుగున, చేతులు జాపి, కొంకర్లు పోయి మెలి తిరిగిన వ్రేళ్ళతో పడవఅంచులు పట్టుకొని 'కూర్చున్న నా తండ్రి ఇప్పుడు కూడా నాకు కనిపిస్తున్నట్టే వుంటుంది - ఆయన టోపీ కొట్టుకుపోయింది, కుడినుంచీ ఎడమనుంచీ ముందునుంచీ వెనకనుంచీ కెరటాలు ఆయనతలమీద మెడమీద చరిచి కొడుతున్నాయి. ప్రతిసారి తల అల్లాడిస్తూ, మళ్ళీ గుక్క తిప్పుకొని, ఆయన నాకు అరచిచెబుతున్నాడు. చర్మమంతా చీకినట్టులై, ఆయన మనిషి కుంగదీసుకుపోయాడు. భయంతో బహుశః, బాధతోనేమో - బాధతోనే అనుకుంటాను - ఆయనకళ్ళు మిడిగుడ్లు పడ్డాయి.

"'ఒరే! వింటున్నావా?' అని అరుస్తాడు.

"ఒక్కొక్కప్పుడు జవాబుచెపుతాను : 'వింటున్నా'నని.

"'మంచిఅనేదంతా మానవుడినుంచే వస్తుందనిగుర్తుంచుకో!'

"'గుర్తుపెట్టుకుంటాను, నాన్నా!'

"నేలమీదవుండగా ఆయన నాతో ఎన్నడూ ఆవిధంగా చెప్పలేదు. ఎప్పుడూ దయగ హాస్యంతో షంగానూ కనిపించే

వాడు. నన్ను తేలిగ్గానూ అపనమ్మకంగానూ చూస్తున్నాడనీ, ఇంకా చిన్నపిల్లవాణ్ణి చూసినట్లే చూస్తున్నాడనీ అనిపించి, అప్పుడప్పుడు ఆయనమీద కోపంవచ్చేదికూడా! మరి యౌవనం అటువంటిది, ఆ వయస్సులో అంతలో మనస్సు నొచ్చుకుంటుంది.

ఆయన అరుపులు నా భయాన్ని పోగొట్టి వుంటాయి. బహుశః అందువల్లనే ప్రతివిషయం అంత స్పష్టంగా గుర్తుపెట్టుకోగలిగాను.

"ఆముసలి పల్లెవాడు ఒక్క క్షణం అలా సముద్రపు నురుసు చూస్తూ నిశ్శబ్దంగా వున్నాడు. మళ్ళీ కళ్లు తిప్పి, చెప్పటం ప్రారంభించాడు.

"నేను అనేకసంవత్సరాలుగా జనాన్ని చూసాను. జ్ఞాపకం పెట్టుకోవటమంటే అర్థం చేసుకోవటం లాంటి దేనని నా ఉద్దేశం. నువ్వు ఎక్కువ అర్థం చేసుకున్నకొద్దీ, ఎక్కువ మంచితనం చూడగలవు. ఇది నిజం! నామాట నమ్ము!

"నాప్రియమైన తండ్రిముఖం ఇంకా నాకు గుర్తే-పూర్తిగా తడిసిపోయి, పెద్దకళ్ళతో నావంక భయంకరంగానూ ప్రేమాస్పదంగానూ, నాకప్పట్లో చావు లేదని చెప్పేవిధంగా చూస్తూవున్న ఆయన ముఖం నేను ఎన్నటికీ మరచిపోలేను కూడా. అప్పుడు నేను నిజంగానే భయపడ్డాను కాని, నేను చావనని కూడా తెలుసుకున్నాను.

"చిట్టచివరకు మాపడవ బోల్తాపడిపోయింది. మేమిద్దరం ఆ తెల్లిపోతున్న కెరటాల్లో, కళ్లచుట్టూ నురుసు కమ్ముకొని, కొట్టుకులాడుతున్నాం. కొన్ని కెరటాలు

మమ్మల్ని పట్టుకుని, బోర్లాపడివున్న ఆ పడవమీదికి ఎత్తి కొట్టిపోతున్నాయి. మేము పడవకు కట్టివున్న తాళ్ళు చేత పట్టుకున్నాం. వాటిని పట్టుకుంటానికి తగినంతమాత్రం శక్తి వుండగా, ఈ కెరటాలు, మమ్మల్ని పడవనుంచి దూరం కొట్టెయ్యలేవు. కాని, అన్నిటికంటె ఆ నీటిలోంచి తలలు బైటికి పెట్టటమే కష్టంగా వుంది. చాలాసార్లు కెరటాలు మమ్మల్ని పడవమీదికి విసరికొట్టి, మళ్ళీ వెనక్కి లాగేసాయి. మరీ భయంకరమైంది ఏమిటంటే, తల ఊదులాడుతూ వుంటుంది; కళ్ళు కనపడవు, చెవులు వినపడవు; చెవుల నిండా నీళ్ళుపోతాయి, మనం కూడా నీళ్ళు తాగుతుంటాము.

"ఇలా ఏడు గంటలు గడిచింది. ఆ తర్వాత అకస్మాత్తుగా గాలి తీరంవైపుకు తిరిగింది. కెరటాలు మమ్మల్ని మహావేగంగా తీరం వైపుకు మోసుకు పోతున్నాయి

"'ఆపు!' అని నేను సంతోషంగా అరిచాను.

"నాన్న ఏదో అరచి బదులు చెప్పాడు కాని నాకు ఒక్కమాటే వినిపించింది '...కొట్టుకుంది...'

"ఆయన గుట్టల విషయం చెప్పివుంటాడు. అవి చాలా దూరాన వున్నాయి. నేను నమ్మలేదు. కాని నా కంటె ఆయన కెక్కువ తెలుసు. మేము ఆ కొండల్లాంటి కెరటాల మీద అసహాయంగా అశక్తంగా కొట్టుకుపోతూ, నిర్దయగా మా శరీరాలు విరగగొడుతున్న ఆ పడవను పట్టుకు వేళ్ళాడుతున్నాము. ఇలా చాలాకాలం గడిచింది. చిట్ట చివరకు తీరందగ్గరి నిలువుగుట్టలు కళ్ళబడ్డాయి. ఆతర్వాత ప్రతిదీ అతిత్వరితంగా జరిగిపోయింది. ఆ కొండలు, మామీద

విరుచుకుపడేటట్లుగా, నీటిమీదికి వంగి, ఊగుకుంటూ మా వైపుకు వచ్చేస్తున్నాయి. తెల్లటి కెరటాలు మమ్మల్ని నలుమూలకు ఒక్కసారి, రెండుసార్లు – ఊపికొట్టాయి. చాటుమునుమునకింద చిక్కిన పోకచెక్కలా, మా పడవ తుత్తునియలై పోయింది. నా శరీరమంతా జర్జరితమైపోయింది. నాకళ్ల ఎదుట అస్పష్టంగా తారసిల్లుతూ, కత్తుల్లాగావున్న ఆ నల్లటికొండ కోనలు, కనిపిస్తున్నాయి. నాతండ్రితల ఎత్తుగా గుట్టమీద ఆరాక్షసి కోరల్లో ఇరుక్కున్నట్టు కనిపిస్తున్నది.

“ఆతర్వాత ఒకటిరెండు గంటలకు ఆయన్ను ఒడ్డుకు పట్టుకొచ్చారు. ఆయన వెన్నువిరిగివుంది, తల బద్దలైపోయింది. తలమీద తగిలిన ఆ భయంకరమైన గాయంనుంచి మెదడు బైటికి కారిపోతున్నది. నాకు బాగాజ్ఞాపకం – బూడిద రంగులోవున్న ఆ మెదడులో నడిచే రక్తనాళాలు చూస్తుంటే, నురుసూ రక్తం కలిసినట్లున్నాయి. ఆయన శరీరమంతా తునాతునకలైపోయింది. కాని ఆయన ముఖంమాత్రం కళ తప్పకుండా, ప్రశాంతంగానే వుంది; కళ్ళుగట్టిగా మూసుకుని వున్నాయి.

“ఇక నేను? నేనుకూడా బాగానే నలిగిపోయాను. నన్ను ఒడ్డుకు చేర్చినప్పుడు నాకు స్పృహలేదు. అసలు, మమ్మల్ని ఒడ్డుకుతీసింది, మావూరికి చాలా దూరానవున్న అమాల్ఫి అవతల! కాని, అక్కడివాళ్ళుకూడా పల్లెవాళ్లే కనుక, వాళ్ళకు ఇలాంటి సంఘటనలు ఆశ్చర్యంగా వుండవు. అయితే, దయతోను సౌహార్ద్రంతోనూ చూస్తారు. నిజానికి,

ప్రమాదభరితమైన జీవితాలు గడిపేవాళ్ళంతా ఎప్పుడూ దయగానేవుంటారు!

"నేను నా తండ్రినిగురించి నిజంగా ఏమనుకుంటు న్నానో, ఈ యాత్రెయొక్క వళ్ళనుంచీ నా హృదయంలో ఏమి నిక్షేపించుకున్నానో నీకు తెలిసేట్టు చెప్పలేకపోతున్నా నేమో నని నాభయం. అలాచెప్పటానికి ప్రత్యేక పదజాలం కావాలి, పదజాలమే కాదు కవిత్వం కావాలేమో! కాని మేము మామూలు మనుష్యులం, చేపల్లాంటి వాళ్ళం, అను కున్నది అనుకున్నట్లు చెప్పలేము. ఎవడైనా అనుకున్నదీ, తెలిసిందీ అంతా చెప్పలేడు.

"కాని, ఇంతకూ చెప్పవచ్చిందేమంటే - నా తండ్రి తన తుదిక్షణంలో, తనకు చావు తప్పదని తెలిసికూడా, భయ పడలేదు; నన్ను మరచిపోలేదు; నేను ఏమేమి తెలుసుకోవా లని ఆయన అనుకున్నాడో అవన్నీ చెప్పేందుకు అవకాశం కలిగించుకున్నాడు, బలం తెచ్చుకున్నాడు. ఇప్పటికి నేను అరవై యేడేళ్ళు జీవించినతర్వాత, ఇవాళ నేను చెప్పగలను - అప్పుడు ఆయన చెప్పిన దంతా సత్యమే!"

ఒకప్పుడు ఎర్రగావుండి, ఎండకు వెలిసి ఇప్పుడుగోధుమ రంగుకు మారిన టోపీని తలమీదినుంచి తీసి, ఆ తెల్లటి మాడు క్రిందికి వంచుతూ, పైపు తీసి వెలిగించి, ఇలా వక్కా ణించాడు:

"ఔను - అంతా సత్యమే! మనం ఎలా చూడదలచు కుంటే అలా కనిపిస్తారు మనుష్యులు. వాళ్లను మనం దయతో చూసినట్లయితే, వాళ్ళకూ మనకూ కూడా మేలు చేసుకున్న

వాళ్ళమవుతాము. వాళ్ళూ బాగుపడతారు, మనమూ బాగు పడతాము. ఇది చాలా సులభంగదా?"

గాలి మరీ మరీ బలంగా వీస్తున్నది. కెరటాలు మరీ మరీ పైకిలేస్తూ, మొనలుదేరి నురుసులు గ్రక్కుతున్నాయి. సముద్రంమీద పిట్టలు ఎక్కువై, ఎక్కడికో దూరతీరానికి మరీ మరీ దూరంగా పోతున్నాయి. ఆ ముత్తెరల పడవలు రెండూ నీలాకాశం అంచుచాటున అప్పుడే అదృశ్యమైనాయి.

ఆ నిట్టనిలువుగావున్న లంకగట్టులు నురుసుతో కప్పి వేయబడ్డాయి. ఆ నీలాల నీరు మోతపెడుతూ తీరానికి కొట్టుకుంటున్నది. తుమ్మెదలు తమ నిరంతర ఝుంకారం సాగిస్తున్నాయి.

# 8

# వసంతకాలం

---

అమెరికా వాసిలాగా వున్నటి గడ్డంతో, తేలిక దుస్తుల్లోవున్న మనిషి ఒకడు, హోటల్ ద్వారానికి దగ్గరగా ఇనప బల్లముందు కూచొని, తీరికగా తనలో తాను మాట్లాడుకుంటున్నాడు :

"గే - ఆర్కన్..."

చుట్టూ ఎటు చూసినా కసిందపూబొదలు తెల్లగాను పసుపుపచ్చగాను విచ్చుకొని నృత్యం చేస్తున్నాయి. సూర్యకాంతి ప్రకాశవంతంగా వుంది. ఆ మృదువసంతశోభలో భూమ్యాకాశాలు కళకళ లాడుతున్నాయి. అటు కిందుగా వీధి మధ్య, చెవులనిండా బొచ్చు వ్రేలాడుతూ, గాడిదలు, గిట్టలు కొట్టుకుంటూ, ఎగురుకుంటూ పోతున్నాయి. దుక్కి గుర్రాలు నిదానంగా నడుస్తున్నాయి. ఆ స్వచ్ఛమైన సూర్యకాంతిలోను, పూల తేనె వాసన లొలికే ఆగాలిలోను వీలైనంతకాలం గడపాలన్న కోరికతో జనం అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు.

ఆ కాంతిలో, రంగురంగుల దుస్తుల్లో మెరుస్తూ, వసంతవీరులైన బాలురు, మెరుపుల్లాగా వెళ్ళిపోతున్నారు. చక్కగా ముస్తాబైన స్త్రీలు ప్రక్కలకు వాలుతున్నట్టు కొద్ది

కొద్దిగా ఊగుతూ, ఆకాశంలో తేలిపోతున్నారు. రాత్రికి నక్షత్రాలెంత అలంకారమో, ఇలాంటి శుభ్రమైన సాయంత్రానికి స్త్రీలు అంత అలంకారం.

అమెరికావాడిలాగా, ఆహోటల్లో కూర్చున్న మనిషిలో, ఏదో విశేషం వున్నట్టుంది. అసలు అతన్ని చూస్తే, ఎవడో అసహ్యంగా మురికిగావుండవలసినవాడు, ఆనాడే ఆ మురికంతా కడుక్కొని శుభ్రంగా వచ్చినట్టు కనిపిస్తున్నాడు. ఇళ్ళగోడలమీదా, వీధిలో కదిలే ప్రతివస్తువుమీదా, వీధిప్రక్కనున్న చెట్లపరసలమీదా పడే ప్రతి ఎండపొడనూ లెక్క వేస్తున్నట్టు అతను అతి పరీక్షగా, మాసిపోయినట్టు కనిపించే కళ్ళు పెట్టుకు చూస్తున్నాడు. జారిపోతున్న పెదవులు బిగబట్టి శ్రమపడి ఏదో వింత విషాదగీతం ఈలమీద పాడుతూ పొడుగాటి తెల్లటి వేళ్ళతో ఒక చేత్తో బల్లమీద మద్దెల వేస్తున్నాడు; రెండవ చేత్తో మోకాలిమీద తాళం వేసుకుంటున్నాడు. అతని గోళ్లు తెల్లగా పాలిపోయినట్టు కనిపిస్తున్నాయి. అతని లక్షణాలు చూస్తే తెలివితేటలూ, దృఢనిశ్చయమూ కలవాడిలాగే వున్నాడు. కాని, అతని మొహంమీది కళ అంతా తుడిచేసినట్లుగా పోవటంమాత్రం శోచనీయం.

అతనివంక ప్రత్యేకించి చూచి నమస్కరించి, హోటల్ పనివాడు – కాఫీకప్పూ, పచ్చటి లిక్కరు బుడ్డీ, బిస్కట్లూ – అక్కడ పెట్టిపోయాడు. అప్పుడే, విశాలమైన రొమ్ము కలవాడొకడు, కెంపుల్లాంటి కళ్ళతో వచ్చి, ఆ పక్క బల్లదగ్గిర కూర్చున్నాడు. అతని దవడలూ, మెడా, చేతులూ పొంగచూరి

నట్టున్నాయి. ఒక పెద్దయంత్రంలోని భాగంలాగా అతని శరీరం ఉక్కులాగా గట్టిగా కనపడుతున్నది.

మొదటివాని కళ్ళు అతనిమీద అలసంగా పడేసరికి, అతను కొంచెం లేచి టోపీ ఎత్తి, ఆ దట్టమైన మీసాల్లోంచి అన్నాడు :

"నమస్కారం, ఇంజనీరుగారూ !"

"ఓహో నువ్వా మిత్రమా !"

"నేనే ఇంజనీరుగారూ !"

"మళ్లీ ఏదో జరుగుతుందనుకుంటాను ?"

"మీ పని ఎలావుంది ?"

"మనం ప్రశ్నలతో మాత్రమే సంభాషణ సాగించలేమేమో ! మిత్రమా..." అన్నాడు ఇంజనీరు తన పెదవులమీద చిరునవ్వుతో.

రెండో అతను టోపీ చెవిమీదికి పెట్టుకొని, హృదయం విప్పి నవ్వాడు.

"నువ్వు చెప్పింది నిజం. నువ్వు తెలుసుకోవలసిన విశేషాలు అనేకం చెబుతాలే" అన్నాడు నవ్వుతూ.

బొగ్గు బండి లాగుతున్న ముసలి బొచ్చు గాడిద ఒకటి మెడచాచి, ఏడుపు గొంతుతో ఒక్క అరుపు అరచి, తన గొంతు తనకే అసహ్యంగా వున్నట్టుగా, చెవులు దులుపుకొని, తల నేలకు వంచి, గిట్టలు కొట్టుకుంటూ, వెళ్ళిపోతున్నది.

" మరింత విజ్ఞానం పొందటానికి వీలైన పుస్తకం కోసం ఎలా ఎదురు చూస్తామో, అలా నువ్వు తయారు చేస్తున్న యంత్రం కోసం ఎదురు చూస్తున్నాను..."

"నీ పోలిక నాకు పూర్తిగా అర్థం కాలే" దన్నాడు ఇంజనీరు, కాఫీ తాగుతూ.

"ఒక మంచి పుస్తకం మనిషి ఆత్మను విశృంఖలం చేసి నట్టుగానే, యంత్రం కూడా మనిషి భౌతికశక్తిని విశృంఖలం చేస్తుందంటే మీరు ఒప్పుకోరా ?"

"ఓహో, అదా ? బహుశః నువ్వు చెప్పింది నిజమే?" నన్నాడు ఇంజనీరు, తలెత్తి. తర్వాత, ఖాళీ కప్పు బల్లమీద పెడుతూ, "నువ్వు మళ్లీ విచారం ప్రారంభిస్తా వనుకుంటాను" అన్నాడు ప్రశ్నార్థకంగా.

"అప్పుడే ప్రారంభించా, గదా ! ..."

"ఏమిటి ? మళ్లీ సమ్మెలూ, గందరగోళాలూ - ఇదేనా ?"

"ఔను, అవసరంలేని వన్నీకూడా ..." అన్నాడు టామీ, మృదుహాసంతో, బుజాలెగరేస్తూ.

సన్యాసినిలాగా నల్లటిదుస్తులు ధరించిన ఒక ముస లామె, ఇంజనీరుకు పూలగుత్తులు బహూకరించింది. అతను రెండు తీసుకొని ఒకటి టామీ చేతికిచ్చి, సాభిప్రాయంగా అన్నాడు :

"నీకు మంచి మేధస్సువుందికాని, ఆదర్శవాదివి కావ టం మాత్రం విచారకరం..."

"మీ పూలకూ పొగడ్తకూ కృతజ్ఞత. కాని, విచార కరం అంటున్నారు... ?"

"ఔను ! నువ్వు ముఖ్యంగా కవివి. సమర్థుడైన ఇంజ నీరువు కావాలంటే ఇంకా చాలా నేర్చుకోవాలి !"

టామ్మా నవ్వుతుంటూ అన్నాడు :

"మీరు చెప్పినమాట నిజం. ప్రతి ఇంజనీరూ కవే. మీతో పనిచేస్తూనే, నేను ఈసంగతి గ్రహించాను..."

"మంచి మా టన్నావు..."

"అదేకాదు. మన ఇంజనీరుగారు ఎందుకు సోషలిస్టు కారా? అని కూడా అనుకునేవాణ్ణి. సోషలిస్టు అయిన వాడు కవికూడా అయివుండాలి..."

చితికిపోయినట్టు దుర్బలంగా, ముడుకేసిన కళ్ళతో వున్న ఇంజనీరూ అప్పుడే కొలిమిలోంచి తయారై ఇంకా నగిషీ పెట్టని ఉక్కు యంత్రంలాగా వున్న టామ్మా—అంత విభిన్న స్వరూపాలు గల ఆ యిద్దరూ, ఒకరి నొకరు పూర్తిగా అర్థం చేసుకున్నట్టు నవ్వుకున్నారు.

"కాదు టామ్మా! నాకే ఒక సొంతకార్ఖానావుండి; నీవంటి మంచిపనివాళ్ళు ముప్పై నలభై మంది నాదగ్గరపని చేస్తూ వుండాలనివుంది. అప్పుడైతే మనం ఏమన్నా చెయ్యగలం..." అంటూ పూలగుత్తి కోటు బొత్తాములో పెట్టుకొని మెల్లగా నిట్టూర్చి వేళ్ళతో బల్లమీద నిమురుతున్నాడు ఇంజనీరు.

"ఈ చిన్న చిన్న విషయాలు మనిషి బ్రతుకుకూ పనికీ అడ్డం వస్తాయనుకోటంలో అర్థం లేదు..."

"అయితే నువ్వు మానవచరిత్రఅంతా అల్పవిషయమంటావా ? గొప్ప మెకానిక్‌వి!" అన్నాడు ఇంజనీరుసాభిప్రాయంగా నవ్వుతూ.

కార్మికుడు టోపీ చేత పట్టుకొని ఉద్రేకంతో ఊపుతూ మాట్లాడుతున్నాడు :

"హుఁ! నా తాతముత్తాతల చరిత్ర ఏమిటి ?"

"నీ... తాతముత్తాతలా ?" అన్నాడు నవ్వుతూ ఇంజనీరు 'నీ' అనేమాటమీద నొక్కుతున్నట్టుగా.

"ఔను, నా తాతముత్తాతలే ! కటువుగా వుంది కాదూ ? బహుశః ! బ్రూనో, విక్టో, మార్జినీలు నాపూర్వులు కారా ? నేను వాళ్ల ప్రపంచంలోనే జీవిస్తున్నానుగదా ! వాళ్లఅద్భుత మేధశ్శక్తి సాధించిన ప్రయోజనాన్ని అనుభవిస్తున్నానుగదా ?"

"నిజమే, ఆ దృష్టిలో అయితే !"

"పూర్వులు ఈ ప్రపంచానికి సమర్పించిన సర్వస్వమూ నాదే !"

"నిజమే" నన్నాడు ఇంజనీరు కనుబొమలు చిట్లిస్తూ.

"ఇవాళ మన ఎదుట కనబడుతున్న ప్రతిదీకూడా, మనం ఇంకా ఉక్కులోకి మార్చుకోవలసిన ముడిఇనుము ! అంతే గదా ?"

"ఔను, అది స్పష్టమే !"

"విద్యాధికులైన మీరుకూడా, మా కార్మికుల్లాగానే, పూర్వుల మేధస్సుమీద బ్రతుకుతున్నారు !"

"నేను అది కాదనను" అన్నాడు ఇంజనీరు తలవంచి.

మురికిపాతలు కట్టుకుని ఆటలో నలిగిపోయిన బంతిలాగా వున్న ఒక పిల్లవాడు చేతులోపూలు పట్టుకొని ఇంజనీరు దగ్గర నిలబడి అడుగుతున్నాడు.

"అయ్యా ! పూలు కొనండి..."

"నా దగ్గరున్నాయి గదా..."

"అయినా మీ కెక్కువవుతాయిటండీ..."

"భలే వాడివిరా ! వీరుడివి! నాకు రెండివ్వు !" అన్నాడు టొమ్రిమా.

పిల్లవాడిదగ్గిర పూలు తీసుకొని టొమ్రిమా అందులో ఒకటి ఇంజనీరు కందించాడు. ఇంజనీరు కృతజ్ఞత తెలుపుతూ అందుకున్నాడు.

"ఇవాళ చాలా అందంగా వుంది ?" అని టొమ్రిమా ప్రారంభించాడు.

"ఔను. నిజంగానే, ఈ యాభై యేళ్ల వయస్సులో కూడా నాకు అందంగావున్నట్టే వుంది !"

తర్వాత టొమ్రిమావంక ఆలోచనగా చూసి, పెద్ద నిట్టూర్పువిడిచి, అన్నాడు :

"ఈ వసంతపు లేతఎండల్లో నీ నరాలు తన్మయత్వం చెందటం నీ యౌవనంవల్లమాత్రమే కాదనుకుంటాను. మాకు కనిపించినట్లుకాక, ఈ ప్రపంచమంతా నీ కళ్ళకు మరొక రకంగా కనిపిస్తుందని నేను గట్టిగా చెప్పగలను. ఏం, ఇది కాదంటావా ?"

"ఏమో నాకు తెలీదు. కాని జీవితం చక్కగా వుంటుం" దన్నాడు నవ్వుతూ టొమ్రిమా.

"జీవితంలో కనిపించే ఆకర్షణలవల్లనా ?" అని ఇంజనీరు సందేహంగా అడిగాడు. ఆ ప్రశ్న టొమ్రిమాకు గుచ్చు

కున్నట్టుంది. టోపీ నెత్తిన పెట్టుకుని, తడుముకోకుండా జవాబు చెప్పాడు :

"నేను ప్రేమించే ప్రతిదీ జీవితంలోవుంది కనుక, జీవితం నాకు చక్కగా వుంటుంది. నాకు మాటలంటే ఏవో ధ్వనులూ అక్షరాలూ కావు. ఒక పుస్తకం చదువుతున్నా, ఒక బొమ్మ చూస్తున్నా, ఏదైనా సుందరమైన ఒక వస్తువును చూస్తున్నా, దాన్ని నేనే నాచేతులతోటే తయారుచేసినట్టుగా వుంటుంది !"

తాను బలంగా నవ్వగలిగినందుకు గర్విస్తున్నట్లుగా టామీ ఆ విశాలమైన రొమ్ము విరుచుకొని విరగబడి నవ్వుతున్నాడు. ఇంజనీరు దుర్బలంగా పళ్ళుబైటపెట్టి లోలోపల నవ్వుకుంటున్నాడు.

"నువ్వు చాలామంచివాడివి టామీ ! నిన్ను కలుసుకోటమంటే ఎప్పుడూ హాయిగానే వుంటుంది... కాని, నువ్వు ఆ సమ్మెలూ గందరగోళాలూ లేకుండా వుంటే..." అన్నాడు ఇంజనీరు, రెప్పవాల్చి.

"ఓహో... నే నెప్పుడూ గందరగోళం తెస్తున్నానంటారా ?" అని ఆ నల్లటి గుడ్లతో గంభీరంగా చూస్తూ, "అప్పుడు మనం చేసింది న్యాయంకాదంటారా ?" అని టామీ ప్రశ్నించాడు.

"ఔననుకో ! కాని దానివల్ల కంపెనీకి ముప్ఫైయేడు వేలు నష్టంవచ్చింది. నీకు తెలుసుగదా..."

"మరి ఆ వార కూలీల జీతాలు పెంచితే తెలివిగా వుండేదిగదా ?"

"హుం! నువ్వు తప్పు అంచనా వేస్తున్నావు. తెలిసుకుంటావు! ఎవడి తెలివి వాడి కుంది; ఆఖరుకు పశువుకు కూడా." అంటూ కరస్పర్శకోసం చేయిచాపి, ట్రామా కరస్పర్శ చేస్తుండగా, ఇంజనీరు మళ్లీ అన్నాడు:

"నువ్వు ఇంకా ఎంతో కష్టపడి నేర్చుకోవలసివుంది..."

"ప్రతిక్షణం నేను ఏదో ఒకటి నేర్చుకుంటూనే వుంటాను..."

"నువ్వు అద్భుతమైన తెలివితేటలు గల ఇంజనీరు వవుతావు!"

"ఓ! నా తెలివితేటలు ఇప్పటి కప్పుడే అక్కరకొస్తున్నాయి!"

"మంచిది! మంచిది!" అని షేక్‌హాండి చ్చి, ఇంజనీరు ఆ కసిందపూబందిరుల క్రిందుగా, సూర్యకిరణాలు జల్లులాడుతూ, పెద్దపెద్ద అంగలువేసుకుంటూ వెళ్లిపోయాడు. అప్పటి దాకా గడపదగ్గిర నిల్చొని, ఈ సంభాషణ అంతా వింటున్న హోటలు పనివాడు పర్సులో డబ్బులకోసం వెతుక్కుంటున్న ట్రామా దగ్గరకెళ్లి అన్నాడు:

"మన ఇంజనీరు వృద్ధుడైపోతున్నాడు..."

"ఓ, ఆయనకేం, ఆయన ఇంకా బలంగానే నిలబడగలడు. ఆ బుర్రలో కావలసినంత శక్తివుంది!" అన్నాడు ట్రామా పమ్మకంగా.

"ఈసారి మీరెక్కడ ఉపన్యాసమిస్తారు?"

"అక్కడే. లేబర్ ఎక్స్ఛేంజిదగ్గిర, నువ్వెప్పుడనా విన్నావా?"

"ముమ్మూర్తులు విన్నాను, కామ్రేడ్..."

ఆర్ద్రంగా కరస్పర్శ చేసుకుని ఆయిద్దరూ నవ్వుకుంటూ విడిపోయారు. హోటలుపనివాడు బల్లలు తుడుస్తున్నాడు. టాక్సీమా ఇంజనీరు వెళ్లినవైపునకాక, రెండోవైపుగా వెళ్ళిపోయాడు.

తెల్లటిదుస్తులతో బడినుంచి ఇళ్లకు పోతున్న బాలబాలికలు నవ్వుకుంటూ రణగొణ ధ్వనిచేస్తూ వీథిమధ్య గుంపుగా నడుస్తున్నారు. ఇద్దరు పిల్లలు కాగితంతో టపాకాయలు కొడుతున్నారు. కసింద పూబొదలు వాళ్లమీద గమ మంచు రేకులు విరజల్లుతున్నాయి.

ముఖ్యంగా వసంతకాలంలో పిల్లల్ని చూసినప్పుడు ఒక్కమాట చెప్పాలనిపిస్తుంది:

"ఓ పిల్లలారా! ఇక భవిష్యత్తంతా మీదే!" నని.

# 9

# ప్రతిజ్ఞ

---

తెల్లవారుజామునుంచీ కుంభవర్షం కురిసిన మేఘాలు, మధ్యాహ్నంసరికి వట్టిపోయి, నల్లరూపు విచ్చి, దూదిపింజల్లాగా గాలి విసురుకు కదలిపోయి, వాన వెలిసిన సముద్రం మీది పొగమంచులాంటి నీడలో కలిసిపోయాయి.

లంకలో సూర్యకాంతి కళ్ళు చెదరగొడు[illegible] తూర్పున నల్లటి ఆకాశంమీద మెరవు తీగెలు ఇం[illegible] తళా నడచిపోతున్నాయి.

దూరంనుంచి చూస్తే, ఆ లంక మహోత్సవనా[illegible] లయంలాగా వుంది. ప్రతివస్తువూ పరిశుభ్రంగా కన్పిస[illegible] అంతటా తోరణాలు కట్టినట్టు పూలతీగెలు అల్లుకుని వున్నా[illegible] ప్రతిచోటా వాన నీటి బొట్లు మిలమిలలాడుతున్నా[illegible] పసుపు పచ్చని లేత ద్రాక్ష ఆకులమీద గోమేధికాల మాదిరిగాను, 'విస్టేరియా' పూల గుత్తులమీద స్ఫటికాలలాగాను, ఎర్రటి 'జెరేనియం' పూలమీద కెంపులలాగాను, గడ్డి మీద చెట్ల ఆకులమీద పాదులమీద పచ్చలలాగాను - ఆ నీటి బొట్లు నవరత్నాలలాగా వివిధవర్ణాల్లో పరిసరాలను బట్టి మెరిసిపోతున్నాయి.

వాన వెలిసిన ప్రశాంతిలో గాలి నిశ్చలంగా వుంది.

సెలయేటి గలగల, ఆ గుట్టల్లోను, చెట్ల వేళ్ళ కిందా, ఇంకి పోయింది. దిగువనున్న సముద్రంనుంచి మృదువుగా మర్మర ధ్వనులు వినిపిస్తున్నాయి.

'ఫర్జి' మొక్కల బంగారు కాడలు, తమపైనున్న నీటితుంపురుల బరువుకు వాలుతూ, నిశ్శబ్దంగా వాటిని దులుపు కుంటూ, ఆకాశం వంక చూస్తున్నాయి.

ఆ ఆకుపచ్చటి వాతావరణంలో ఊదారంగులోవున్న 'విస్టేరియా' రక్తవర్ణంలోని జెరేనియంలతోను, గులాబీల తోను పోటీపడుతున్నట్టుంది. 'క్లెమాటిస్' పూలు 'ఇరైజెస్' పూలతోను 'జిల్లీ' పూలతోను కలిసి, ఓ పెద్దతివాచీ పరచి నట్టుగా వున్నాయి ఆ దృశ్యమంతా సుస్పష్టంగాను ప్రకాశ మానంగాను వుంది. పూలన్నీ వీణల్లాగా వేణువుల్లాగా గానం చేస్తున్నట్టున్నాయి.

ఆ తడిగాలి అంతా పూలవాసనలతోనిండి, ప్రాతద్రాక్ష సారాయంలా, మత్తెక్కించేటట్టుంది.

రాళ్లుకొట్టిన గుర్తులతోను, మందుపేల్చిన మరకల తోను, సగంపడి, విరిగిపోతున్నట్టున్న ఒక కొండదగ్గిర నలు గురు క్వారీ పనివాళ్లు తడిసిన మురికిపాతల్లో, తోలుచెప్పులతో కూర్చొని, మాట్లాడుకుంటూ మధ్యాహ్నం భోజనం చేస్తు న్నారు.

అందులో ఇద్దరు శుభ్రంగా గడ్డంచేసుకుని అన్నదమ్ము ల్లాగా-కవలపిల్లల్లాగా-వున్నారు. మూడోవాడు-పొట్టి, దొడ్డి కాళ్లు, ఒక్కటేకన్ను; అమిత చలాకీగా ముసలి పిట్టలాగా వున్నాడు. నాలుగోవాడు-పెద్దరొమ్ము, గడ్డం, కొంగముక్కు;

నడివయస్సులో వున్నాడు. తలంతా చాలా భాగం నెరిసి పోయింది.

అతను, సారా అంటిన మీసాలు తుడుచుకుంటూ, ఓ పెద్ద రొట్టెముక్క తుంచి, ఆ చీకటి గుహలాగా వున్ననోట్లో పెట్టుకున్నాడు. ఒకే చెంప రొట్టెను నములుతూ, గడ్డమూ మీసాలు కప్పుకున్న ఆ దవడలు కదిలిస్తూ అతను చెబుతున్నాడు.

“అర్థంలేదు. అదంతా అబద్ధం. నేనేమీ తప్పు చెయ్యలేదు......”

ఆ దట్టమైన కనుబొమల క్రిందవున్న అతని గోధుమ రంగు కళ్లలో ఆందోళన వుంది. గొంతు గద్గదంగా వుంది. ఆదుర్దాతో నిదానంగా ఒక్కొక్క మాటే చెబుతున్నాడు. ఆటోపీ, చుట్టూ బొచ్చుతో ముతగ్గావున్న ఆ మొహం, ఆ వెడల్పాటి చేతులూ, తెల్లటి రాతిపొడితో నిండిన ఆ నీలి దుస్తులూ_అతని శరీరంమీద ఏదిచూసినా తెలుస్తుంది: కొండ పేల్చటానికి రంధ్రాలు తొలిచేవాడు అతనేనని.

అతని తోటి పనివాళ్లు ముగ్గురూ అతను చెప్పేది శ్రద్ధగా వింటున్నారు. అతన్ని మధ్యలో ఆపకుండా, చెప్పమన్నట్లు, అప్పుడప్పుడు తల లెత్తి, అతనివంక చూస్తున్నారు.

కనుబొమలు కిందికీ పైకీ ఆడిస్తూ, అతను చెప్పుకుపోతున్నాడు:

“ఆండ్రియా గ్రిసో అంటారే, అతను మావూరికి మొదట్లో రాత్రిపూట దొంగల్లే వచ్చాడు. గుడ్డలన్నీ పీలికలు. అప్పుడతను పెట్టుకొచ్చిన టోపీ అతని బూట్ల రంగు

లోనే వుండి, ఆ బూట్లలాగానే పిగిలిపోయి వుంది. కాని వాడిలో ఎంత పేరాశ, ఎంత సిగ్గులేనితనం, ఎంత క్రూరత్వం! సరిగ్గా పదేళ్ళు గడిచాయో లేదో వూరి పెద్దలంతా అతన్ని చూడగానే వంగివంగి నమస్కరిస్తుంటే, అతను చూసీ చూడనట్లు తలూపుతూ పోవటం ప్రారంభించాడు. అప్పటికే చుట్టుపట్ల నలభై మైళ్ళలో వున్న ప్రతివాడికీ అతను అప్పు పెట్టాడు."

"ఔను, అలాంటివాళ్ళుంటా" రన్నాడు నిట్టూర్చి తలూపుతూ దొడ్డికాళ్ళ అతను.

కథ చెప్పే అతను, అతనివంక చూసి: "నువ్వుకూడా అలాంటివాళ్ళను చూసావన్న మాట!" అని హాస్యంగా అడిగాడు.

వృద్ధుడు ఔనన్నట్టుగా తలూపాడు. యువకు లిద్దరూ ఒక్కసారిగా చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు. కొంగముక్కు అతను, ఒక్కగుక్క నారా పీల్చి, నీలాకాశంలో ఎగురుతున్న పిట్టవంక చూస్తూ, మళ్ళీ కథ ప్రారంభించాడు:

"అతను మేడకట్టేటప్పుడు నేను అతని దగ్గిర రాళ్ళు మోసేందుకు కూలికి కుదిరాను. అప్పటికి నాకు పదమూడేళ్ళు. మమ్మల్ని జంతువులకంటే అన్యాయంగా చూసేవాడు. ఒకనాడు నాతోటి పనివాడు లూకినో అతని దగ్గిరకెళ్ళి 'మమ్మల్ని గాడిదలకంటే నీచంగా చూడటం న్యాయంకా' దని చెప్పాడు. దానిమీద ఏమన్నాడని – 'నాగాడిద వుందంటే అది నాదికనుక దయగా చూస్తాను. నువ్వు ఎవడివో పరాయివాడివి. నిన్ను దయగా ఎందుకు చూడాలి?'

అన్నాడు. ఆమాటలు వింటుంటే నాకు కత్తిపోటు తగిలినట్లని పించింది. అప్పటినుంచీ అతన్ని జాగ్రత్తగా కనిపెట్టే తిరుగు తుండేవాణ్ణి. అందరివిషయంలోనూ అతను చాలా నీచంగా క్రూరంగా ప్రవర్తించేవాడు. అతని దృష్టిలో వృద్ధులూ స్త్రీలూ అనికూడా ఏమీ తేడావున్నట్లు కనిపించలేదు. ఎవ రన్నా పెద్దమనుష్యులు వచ్చి అతని ప్రవర్తనను ఆక్షేపించి నప్పుడు అనేవాడు: 'నేను దరిద్రంలో వున్నరోజుల్లో నన్ను ఇంతకంటే ఎవరు బాగా చూసారు కనుక ?' అని. అతని చుట్టూ ఎప్పుడూ చచ్చి అధికారులూ, సైనికులూ, పోలీసులూ తిరుగుతుండేవాళ్ళు. ఏదన్నా మరీ గొంతుమీదికి వచ్చి నప్పుడుగాని ఊళ్ళోవాళ్ళు అతని దగ్గిరి కెప్పుడూ వెళ్ళేవాళ్ళు కాదు. ఇక ఆవెళ్ళినప్పుడు ఏమైనా చెయ్యగలడు – అతని ఇష్టం – అంతా బలిజంతువులు."

"ఔను. అలాంటివాళ్ళున్నారు!" అని వృద్ధుడు మళ్ళీ అన్నాడు. తక్కిన ముగ్గురూ అతనివంక సానుభూతితో పరి కించారు. ఆ అన్నదమ్ముల్లో ఒకడు అతనికి సారాబుడ్డి చేతి కిచ్చాడు. అతను ఆబుడ్డి ఎండలోకి ఎత్తిపట్టి – 'మెడోనా పవి త్రాత్మకోసం తాగుతున్నా' నని, పెదవుల కానించుకు న్నాడు.

నడివయస్సువాడు మళ్ళీ ప్రారంభించాడు:

"'ధనవంతులకోసం పేదవాళ్ళూ, తెలివిగలవాళ్ళ కోసం మూర్ఖులూ ఎప్పుడూ కష్టపడుతూనే వున్నారు. ఎల్ల కాలం అలాగే వుంటారేమో కూడా!' అని అతను తరచుగా చెబుతుండేవాడు."

అని చెప్పి ఒక వింతనవ్వు నవ్వి, ఆ కథకుడు బుడ్డికోసం చెయ్యి జాచాడు. అందులో ఏమీ లేకపోవటం చూచి తను సుత్తెలకూ గునపాలకూ దూరంగా రాళ్ల మీదికి దాన్ని నిర్లక్ష్యంగా విసిరేసాడు. అది తగిలి, నేలమీదవున్న మందు తాడు నల్లతాచులా మెలికలు తిరిగింది. అతను తిరిగి కథ లోకి వచ్చాడు:

"అప్పుడు నేను చాలాచిన్నవాణ్ణి. అయినా, ఆమాటలంటే అసహ్యం వేసేది. తక్కినవాళ్లు కూడా అలానే అనుకునేవారు. ఆమాటలు మాఆశల్ని చంపేసాయి. ముందేదో చెయ్యాలనుకునే మాకోర్కెల్ని కూడా తుంచేసాయి. ఒక రాత్రి పొద్దుపోయాక, అతను గుర్రంమీద పొలంలోంచి పోతుండగా, నేనూ లూకినో అతన్ని కలుసుకున్నాము. అతన్ని ఆపి, మర్యాదగానే, స్పష్టంగా చెప్పాం: 'మనుషుల్ని కొంచెం దయతో చూడాలని అడుగుతున్నా'మని."

వింటున్న యువకులిద్దరూ విరగబడి నవ్వారు. వృద్ధుడు కూడా మెల్లగా ఇకిలించాడు. కథకుడు ఓ పెద్దనిట్టూర్పు పుచ్చాడు.

"ఔను, నిజమే, అది తెలివితక్కువే! కాని యావనంలో చాలానిజాయితీ వుంటుంది. మనమాటకేదో శక్తివుందనిపిస్తుంది. జీవితమంతటికీ యావనం అంతరాత్మలాంటిదని కూడా చెప్పవచ్చు..."

"సరే, అత నేమన్నాడు?" అని వృద్ధు డడిగాడు.

"'వెధవలు! నాగుర్రాన్ని పోనివ్వండి!' అని అరుస్తూ మావంక పిస్టల్ గురిపెట్టాడు. మేము చెప్పాము: 'మమ్మల్ని

చూసి భయపడాల్సిన అవసరమేమీ లేదు. కోపందేనికి? మేం ఊరికా సలహా చెబుతున్నాం. అంతే!' అని"

"ఇది బాగుంది!" అన్నాడొక యువకుడు. రెండో వాడు అంతే నన్నట్టుగా తలవూపాడు. వృద్ధుడు, రాతిమీద తన వంకర వేళ్ళతో కొడుతూ, దాన్ని పరిశీలిస్తున్నాడు.

అంతలో భోంచెయ్యటం పూర్తయింది. అందులో ఒకడు ఓపుల్ల తీసుకొని, గడ్డిపోచలమీదవున్న నీటిబొట్లు దులుపుతున్నాడు; మరొకడు పుల్ల పెట్టి పళ్ళుకుట్టుకుంటున్నాడు. గాలి తడి ఆరిపోయి, క్రమంగా వేడెక్కుతున్నది. మధ్యాహ్నపు చిన్న చిన్ననీడలు త్వరగా కరిగిపోతున్నాయి. ఆ గంభీరమైన గాథకు సముద్రం మెల్లగా శ్రుతి కలుపుతున్నది:

"అప్పుడలా చెప్పినందువల్ల తర్వాత లూకినోకు అనేక కష్టాలు చుట్టుకున్నాయి. లూకినో తండ్రి, మామాకూడా గ్రిసోకు బాకీవున్నారు. అది ఆధారంచేసుకొని గ్రిసో వాళ్ళ కొంప కూల్చాడు. నానాటికీ లూకినో చిక్కిపోయి, దవడలు వేళ్ళాడుతూ దీనంగా అయిపోయాడు. యువతుల్ని ఆకర్షించిన అతని నేత్రాల్లో క్రమంగా కళ చచ్చిపోయింది. 'అప్పుడు మనం చేసింది తెలివితక్కువ పని! తోడేలుకు మాటలు చెప్పి లాభమేముంటుంది?' అని నాతో ఒకసారి అన్నాడు, లూకినో. ఆమాటలు వింటుంటే, అతను చావుకు సిద్ధంగా వున్నాడనిపించింది. అతన్ని అతని ఉత్తమ కుటుంబాన్ని తలచుకుంటే నాకు జాలివేసింది. కాని, నేనూ బీదవాణ్ణే. ఆమధ్య మాతల్లి మరణంతో ఒంటరిగాణ్ణికూడా అయినాను."

రాళ్లు కొట్టే ఆ కొంగముక్కు కథకుడు, ముడుపు చారలు పడ్డ వేళ్లతో, ఒకసారి, మీసాలూ గడ్డం దువ్వుకొన్నాడు. అతని ఎడమచేతికున్న వెండి ఉంగరం తెల్లగా కనిపిస్తున్నది.

"నేను ఆపని కడకంటా చెయ్యగలిగినట్టయితే నా తోటివాళ్లకు సేవచేసినట్లయ్యేది. కాని నాది మెత్తటిమనస్సు. ఒకనాడు గాడ్రిసో బజార్లో కనిపిస్తే, అతని దగ్గరకెళ్లి, పక్కనే నడుస్తూ, వినయంగా చెప్పాను: 'నువ్వు నీచుడివి, దురాశాపరుడివి. నీవు జీవించటమంటే ఈ మనుషులందరికీ కష్టంగా వుంది. నువ్వు ఎవణ్నో ఒకణ్ణి కదిలించకా మానవు, వాడు నీ మీదికి కత్తి దూయకా మానడు. నీకు నాసలహా ఏమంటే — ఇక్కణ్ణించి లేచిపో!' అన్నాను. 'మూర్ఖుడా, పో!' అన్నాడు. నేను వదలకుండా చెబుతూనే వున్నాను. 'ఇటు చూడు. నన్ను శాంతంగా వదిలెయ్యటానికి ఎంత తీసుకుంటావు? ఒక అణా చాలునా?' అన్నాడు నవ్వుతూ. చాలా కష్టం వేసింది. కాని కోపం అణచుకుని, 'నువ్విక్కణ్ణించి లేచిపోవాలి!' అంటూ అతని కుడివైపున బుజం బుజం తగులుతూ నడుస్తున్నాను. నేను ఏమరుపాటులో వుండగా, అతను కత్తి తీసి, నా గుండెలో పొడిచేశాడు. ఏమైనా ఎడమచేత్తో ఏం చెయ్యగలం? ఎంత ఆపి పట్టుకున్నా, అది అంగుళంలోతు దిగిపోయింది. వెంటనే అతన్ని పట్టుకొని, నేలకు విసిరికొట్టి, పందిని తన్నినట్టు తన్నాను.

"అతను నేలమీద పొర్లాడుతుండగా 'ఇప్పుడైనా నా సలహా వింటావా?' అని అడిగాను."

ఆ ఇద్దరు యువకులూ అతనివంక తేరిపార చూసి ఊరుకున్నారు. వృద్ధుడు తన చెప్పులు సరిచేసుకుంటున్నాడు. మళ్లీ కథకుడు మొదలుపెట్టాడు:

"మర్నాడు నేనింకా నిద్రలేవకముందే, సైనికులు వచ్చి, నన్ను షరీఫ్ దగ్గరికి పట్టుకెళ్ళారు. అతనుకూడా గాస్పారోకు స్నేహితుడే. 'సీనో, నువ్వు మంచివాడివల్లే వున్నావు. కనుక నిన్నరాత్రి నువ్వు గాస్పారోను చంపటానికి ప్రయత్నించిన సంగతి కాదన వనుకుంటాను' అని అడిగాడు. నేను అది పూర్తిగా నిజంకాదని చెప్పాను. కాని వాళ్ళు అర్థంచేసుకునే విధం వేరు. అందువల్ల నా కేసు విచారణ కావటానికిముందు నన్ను రెండు నెలలు జైల్లో పెట్టారు. తర్వాత సంవత్సరం ఎనిమిదిమాసాలు శిక్ష చెప్పారు. నేను అప్పుడే న్యాయమూర్తులతో అన్నాను: 'సరేకాని, ఇది ఇంతటితో అయిపోయినట్టు నేననుకోటంలేదని.'"

తర్వాత, తాను రాళ్ల మధ్య దాచిన సారాబుడ్డి ఒకటి తీసి, తనివితీర, తాగుతున్నాడు. ఆ గుబురుగడ్డం పైకీ కిందకీ ఊగులాడుతున్నది. తక్కిన ముగ్గురికళ్లూ అతనివంక గంభీరంగా నిశ్శబ్దంగా కనిపెట్టుకున్నాయి.

అతను తనచేతిలోని బుడ్డి తక్కినవాళ్లకిస్తూ, మీసాల మీద గడ్డంమీద తడి తుడుచుకొని "అమాట ఎత్తితే కష్టంగా వుంటుం"దని ప్రారంభించాడు:

"నేను జైలునుంచి తిరిగివచ్చాక, అవూళ్ళో నాకు నిలువ నీడలేదనేది స్పష్టపడిపోయింది. ప్రతివాడికీ నేనంటే

భయం. ఆ ఏటి పరిస్థితులు మరీ విషమించాయని లూకినో చెప్పాడు. ఆ చిక్కులతో అతను జబ్బుపడి, మంచమెక్కి, చావుకు చేరువలో వున్నాడు. 'అయితే, ఇదన్నమాట సంగతి!' అనుకొని, నేను గాబ్రిసోను చూడటానికి వెళ్లాను. నన్ను చూసీ చూడటంతోటే అతను కంగారుపడ్డాడు. 'ఔను నేనే! మళ్ళీ వచ్చాను. ఇప్పుడు నువ్వు లేచిపోవలసిన సమయం ఆసన్నమైంది!' అన్నాను. అతను వెంటనే రైఫిల్ తీసుకొని నాకాళ్లకు గురిపెట్టి కాల్చాడు. కాని అందులో పిట్టల్ని కొట్టే గుండు వుండటంవల్ల, నాకేమీ దెబ్బ తగల లేదు; నేను పడలేదుకూడా. 'నువ్వు నన్ను చంపితే, నేను శ్మశానంనుంచయినా వచ్చి నిన్ను వెంటాడుతాను. ఇక్కడి నుంచి నిన్ను వెళ్ళగొట్టి తీరతానని నేను మెడోనా తల్లికి ప్రతిజ్ఞ చేసాను. నువ్వు మొండివాడివి, నేనూ అంతే.' అని చెప్పాను. తర్వాత ఇద్దరం కలియబడ్డాం. కాని నాకు తెలీకుండానే అతని చెయ్యి విరిగిపోయింది. అసలు అతనిమీద దౌర్జన్యం చెయ్యాలని నా ఉద్దేశంకాదు. ముందుగా నా మీద కలియబడ్డదికూడా అతనే. ఆసమయంలో జనం పోగై నన్ను అవతలికి లాక్కుపోయారు. ఈసారి నాకు మూడేళ్ళ మీద తొమ్మిది నెలలు శిక్షపడింది. శిక్ష పూర్తి అయి, నేను తిరిగి వచ్చేటప్పుడు, నా కథంతా తెలిసి నన్ను దయతో చూసిన జైలు అధికారి 'నువ్వు మళ్లీ ఇంటికి పోవద్దు' అని నొక్కినొక్కి చెప్పాడు. ఆయన అల్లుడిదగ్గర పని చూపిస్తానన్నాడు — ఆయనకు 'అపూలియా'లో చాలా భూమీ, ద్రాక్షతోటలూ వున్నాయట. అయినా సహజంగానే, నేను

నా మీద పెట్టుకున్న కర్తవ్యాన్ని విడిచిపుచ్చలేకపోయాను. మళ్ళీ ఇంటికే వెళ్ళాను. ఈసారి నిరర్థకంగా వాగాలని కాదు, దృఢనిశ్చయంతోటే! మనం మాట్లాడే మాటల్లో నూటికి తొంభై వృథా అని అప్పటికే అర్థమైంది.' నేను అతనికి చెప్పవలసిన మాటల్లా ఒక్కటే: 'వెళ్ళిపో!' అని. నేను ఊళ్ళోకి వచ్చినరోజు ఆదివారం. సూటిగా చర్చికి ప్రార్థన కెళ్ళాను. గారిసో అక్కడే వున్నాడు. నన్ను చూడగానే అతను దూకి పారిపోతూ చర్చిఅంతా, 'వీడు నన్ను చంపటానికొచ్చాడు! చూడండి, మృత్యువు వీణ్ణి నాకోసం పంపింది!' అని వెర్రికేకలు పెట్టాడు. అతన్ని ముట్టుకోటానికి గానీ, అతనికి చెప్పవలసింది చెప్పటానికిగానీ అవకాశం చిక్కక ముందే, జనం నన్ను చుట్టేసారు. కాని అందువల్ల ఏమీ నష్టం కలగలేదు. అతను ఆ భయంలో అపస్మారం వచ్చి, ఆ రాతి నేలమీద విరుచుకు పడ్డాడు శరీరం కుడిభాగానికీ నాలుకకూ పక్షవాతం వచ్చింది. ఆ తర్వాత ఏడు వారాలకు చచ్చాడు...... అంతే! అంతటితో అయిపోయింది! కాని జనం నన్ను గురించి ఒకరకం కట్టుకథ కనిపెట్టారు... అది చాలా భయంకరంగా వుంటుంది, కాని అర్థం లేదు."

అతను నవ్వు అణచుకుంటూ పొద్దువంక చూసి 'మన పనికి వేళైం' దన్నాడు.

తక్కిన ముగ్గురూ నిశ్శబ్దంగా లేచారు. ఆ కొంగ ముక్కు పనివాడు కొండ పగుళ్ళ వంక చూస్తూ 'పని ప్రారంభిద్దాం!' అన్నాడు.

సూర్యుడు నడినెత్తిమీది కొచ్చాడు. నీడలన్నీ, ఎండి పోయినట్లుగా, అదృశ్యమైనాయి.

ఆకాశం అంచున వున్న మేఘాలు సముద్రంలోకి మునిగి పోయాయి. సముద్ర జలాలు మరీ నిశ్చలంగా, మరీ నీలంగా మెరుస్తున్నాయి.

---

# 10

# ముందు తరాలు

---

'పెపే' పదేళ్ళవాడు. బల్లిలాగా, సన్నగా దుర్బలంగా, తిరుగుతుంటాడు. అతని దుమ్ము కొట్టుకున్న చొక్కా బుజాలమీదనుంచి వేళ్ళాడుతూ వుంటే, ఎండతోను మురికితోను నలుపెక్కిన అతని చర్మం, లెక్కలేనన్ని చిరుగుల్లోంచి తొంగి చూస్తుంటుంది.

సముద్రపుగాలికి అటూ ఇటూ ఊసులాడే ఎండుగడ్డి పోచలాగా, అతను అగుపిస్తాడు. పొద్దుపొడిచింది మొదలూ పొద్దు క్రుంకిందాకా, అతను ఆలంకమీద గుట్టనుంచి గుట్టకు తిరుగుతూ, అనుక్షణం అలుపులేకుండా సన్న గొంతుకతో పాడుతుంటాడు:

ఓ నాచక్కని ఇటలీ!

నా కన్నతల్లి ఇటలీ! –

సుక్షేత్రాలమీద వాసనలు విచ్చుకునే పూలూ; సున్నటిరాళ్ళమీద పాకులాడే బల్లులూ; చిత్రకవట్టిట్టున్న ఆలివ్ ఆకులమధ్య, పచ్చలు చెక్కినట్టున్న ద్రాక్షతీగలమధ్య కూర్చున్న పిట్టలూ; సముద్రపుటడుగున చీకటినాచుతోటల్లో వుండే చేపలూ, బస్తీలో వంకరటింకరగావున్న ఇరుకువీథుల్లో నడిచే విదేశీయులూ; మొహంమీద కత్తిగాటుతో జర్మనీ

వాడూ; నరద్వేషి పాత్ర ధరించిన నటుణ్ణి సర్వదా జ్ఞప్తికి తెచ్చే ఇంగ్లీషువాడూ; ఇంగ్లీషువాడల్లే వుండాలని వృథాగా ప్రయత్నించే అమెరికావాడూ; తాషామరపా లాగా మోతపెడుతూ, అనుకరించటానికి కూడా సాధ్యంకాని ఫ్రెంచివాడూ — ఇలా కనిపించే ప్రతివస్తువూ, ప్రతి మనిషీ అతనికి కావాలి. ప్రతి విషయం అతిజాగ్రత్తగా పరిశీలిస్తూ వుంటాడు.

జుట్టుకూడా నిక్కపొడుచుకునేటంత స్వాభిమానంతో దవడ లుబ్బించినట్లు కనిపించే జర్మనీ వాణ్ణి, నృత్యంచేసే తన కళ్ళతో పరికిస్తూ, 'పెపె' స్నేహితులతో అనేవాడు: "ఎంత మొహమో చూడండి! నాకనుపంత మొగం పెట్టుకున్నా డేమిటి?"

'పెపే'కు జర్మన్లంటే పడదు వీధుల్లోనూ, చౌకల్లోనూ, జనమంతా తాగి, చీట్లాడుతూ, పత్రికలు చదువుతూ, రాజకీయాలు చర్చించే హోటళ్ళలోనూ, బలీయంగా వుండే అభిప్రాయాలే అతనివి.

అక్కడ, వాళ్ళు చెప్పుకుంటారు: "మన స్నేహానికి ప్రతిఫలంగా ఆఫ్రికా ఎడారుల్ని బహూకరించిన జర్మనీవాళ్ళంటే, మన దరిద్రపు దక్షిణాదివాళ్ళకు బాల్కన్ దేశాల్లోని స్లావ్ జాతివాళ్ళు దగ్గరవాళ్ళు!" అని.

దక్షిణాది సాధారణ ప్రజలు ఈ మాటలు తరచూ చెప్పుకుంటుంటారు. 'పెపె' ప్రతి మాటా వింటాడు, ఒక్కటీ మరచిపోడు.

ఇదుగో ఒక ఇంగ్లీషువాడు, కత్తెరలాంటి కాళ్ళతో,

విసుగుగా నడచివస్తున్నాడు. అతనికి ముందుగావున్న 'పెపే' ఏదో మృత్యుగీతమో, శాంతిగీతమో ఆలపిస్తున్నాడు:

నా మిత్రుడి మరణం,
నా భార్యకు దుఃఖం...
తెలియకున్నదో హో
ఆమెకేమి బాధో.

నవ్వు అణచుకుంటూ, 'పెపే' స్నేహితులు, ఆ విదేశీయుడి వెనకనే నడుస్తున్నారు. ఆ ఇంగ్లీషువాడు తన మసకేసినకళ్ళతో ప్రశాంతంగా వెనక్కు చూసేసరికి, చిట్టెలుకల్లాగా పొదల్లోనో గోడలమాటుననో నక్కుతున్నారు.

'పెపే' ను గురించి ఇలాంటి తమాషా కథలు ఎన్నైనా చెప్పవచ్చు.

ఒకనాడు ఒక దొరసాని తన తోటలోని సీమరేగుపళ్ళు ఒక బుట్టనిండా పోసి, తన స్నేహితురాలికిచ్చిరమ్మని 'పెపే' ను, అణా ఇస్తానని చెప్పి, పంపింది.

మాట్లాడకుండా, బుట్టనెత్తికెత్తుకొని, పెపే వెళ్ళిపోయాడు. సాయంత్రానికి గాని, అణాకోసంకూడా రాలేదు.

"నీకేం తొందరలేనట్టుంది!" అని ఆ దొరసాని అంది.

పెపే నిట్టూరుస్తూ చెప్పాడు: "అమ్మాత్రి, నేనెంత అలసిపోయానని! పదా? పదకొండా?...ఇంకా ఎక్కువే..."

"ఔను. నిజమే బుట్టనిండా పెట్టాను! పదికంటే ఎక్కువే వుంటాయి!"

"పళ్లు కాదమ్మా, పిల్లలు!"

"మరి, పళ్ళమాటేమిటి?"

"పిల్లలమ్మా, ముందు, పిల్లలు..."

ఆమెకు కోపం వచ్చి, అతన్ని, బుజం పట్టుకు, విదిలించేసింది.

"ఏంజవాబు చెప్పు! పళ్ళు ఇచ్చేసి వచ్చావా?" అని అరిచింది.

"నేను వాటిని చౌకుదాకా మోసుకుపోయాను. వినవమ్మా, ఎంతచక్కగా నడుచుచున్నానో: మొదట్లో వాళ్ళ వేళాకోళాలూ వెక్కిరింపులూ చెవిని పెట్టనేలేదు. నన్ను వాళ్ళు గాడిదతో పోల్చితే పోల్చారు, అన్నిటినీ అమ్మగారికోసం - మీ కోసం - భరిద్దాంలే అనుకున్నాను; కాని, వాళ్లు మా అమ్మ పేరెత్తేసరికి ఇక సహించరాదని నిశ్చయించుకున్నాను. బుట్టకింద పెట్టి - అప్పుడు నువ్వు చూడవలసింది - వాళ్లను ఆ పళ్ళు పెట్టి ఎట్లా కొట్టాననుకున్నావో! చూస్తే నిజంగా నువ్వు సంతోషించేదానివి."

"వాళ్ళు నా పళ్ళు ఎత్తుకు పోయారన్నమాట! అంతేనా?" అని ఆమె మళ్లీ అరిచింది.

పెపే దుఃఖంతో నిట్టూర్చాడు.

"లేదు, లేదు. గురితప్పిన పళ్ళు గోడకు కొట్టుకొని చితికి పోయాయి. మిగతావి, నేను శత్రువుల్ని జయించి సంధి చేసుకున్నాక, అందరం కలిసి తిన్నాం ..." అన్నాడు.

ఆమె జడివానలాగా అతని నెత్తిన లక్ష శాపనార్థాలు

కుమ్మరించింది. అతను అన్నీ వినయంగా శ్రద్ధగా వింటూ, మధ్య మధ్య ఓ చక్కని మాటల పొందికకు సంతోషిస్తూ: "ఓహోహో, ఎంత సౌందర్యం! ఏం పదజాలం!" అంటున్నాడు.

చిట్టచివరకు ఆమె కోపం తగ్గిపోయి, తనను వదిలేశాక, అతను ఆమె వెంటపడి చెబుతున్నాడు.

"కాని— ఆ వెధవల్ని మూడు అదిరేట్టు నీళ్ళు పెట్టి ఎలా కొట్టానో—నువ్వు నిజంగా చూసివుంటే, ఇలా అనుకోవు. ఒక అణాకు బదులు, నాకు, రెండణాలిచ్చేదానివి కూడా!"

ఈ విజేత్రి నిగూఢ గర్వం ఆ అమాయకురాలికి అర్థంకాలేదు. అతని మీదకి పిడికిలి బిగించి, గద్దించింది.

ఇదొక కథ.

పెపే అక్క—అతనికంటే చాలా పెద్దది, కాని తెలివితక్కువది—ఒక అమెరికన్ ధనికుడి బంగళాలో పనికి కుదిరింది. అక్కడ చేరీచేరటంతో ఆమె ఆకారమే మారిపోయింది. కడిగిన ముత్యంలాగా పరిశుభ్రంగా తయారయ్యేది. ఆమె చెక్కిళ్ళు గులాబీ రంగులో కొచ్చాయి. ఆమెలో నానాటికీ యౌవనం వికసిస్తున్నట్టుంది.

"నిజంగా, నీకు రోజూ తిండి దొరుకుతుందా?" అని అడిగాడు తమ్ముడొకనాడు.

"రెండుసార్లు, కావాలంటే ముమ్మాట్లు కూడా తినొచ్చు" అంది గర్వంగా.

"పళ్ళు విరిగిపోకుండా చూసుకో!" అని సలహా చెప్పి కొంచెమాగి మళ్ళీ అడిగాడు:

"మీ యజమాని బాగా డబ్బున్నవాడేనా ?"

"ఔను. అతను రాజుకంటే ధనవంతు డనుకుంటాను!"

"అర్థం లేదు! అయితే, అతనికెన్ని లాగు లున్నాయి?"

"చెప్పటం కష్టం."

"పది ?"

"ఇంకా ఎక్కువే..."

"అయితే వెళ్ళి నాకోటి తెచ్చిపెట్టు - మరీ పొడుగాటిది కాకుండా, ఉన్నవాటిల్లోకల్లా వెచ్చగావుండేది, వెతికి పట్టుకురా!"

"ఎందుకు ?"

"ఎందుకా ? నాలాగు చూడు!"

నిజానికి అతని లాగు మాడవలసిం దేమీ లేదు. అందులో చిరిగిపోగా మిగిలింది కూడా తక్కువ.

"సరే, నీకు నిజంగా కుడ్డలు కావాలి! కాని మనం దొంగిలించా మనుకుంటాడేమో ?" అని అనుమానంగా అడిగింది, అంగీకరిస్తూ.

"ఈ మనుష్యు లంతా మనంత తెలివితక్కువ వాళ్ళను కోరు! మనం కావలసినంత ఉన్నవాడి దగ్గర కొద్దిగా తీసుకుంటున్నామంటే, అది దొంగతనం కాదు. ఊరికా, పంచుకోట మన్నమాట!" అని పెపే ఆమెకు ధైర్యం చెప్పాడు.

"నువ్వు మతిలేకుండా మాట్లాడుతున్నావు" అని అప్ప అతనికి అడ్డు చెప్పింది. కాని పెపే ఆమె నీతి నియమాలను జయించగలిగాడు. ఆమె, తేటబూడిదరంగులోవున్న మంచి లాగు ఒకటి పట్టుకొచ్చింది. అది పెపేకు చాలా పెద్దదే. అయినా దాన్ని ఎలా సరిచేసుకోవాలో అతనికి తెలుసు.

"కత్తెర తెచ్చిపెట్టు!"

ఇద్దరూ కలిసి, దాన్ని, పెపేకు సరిపోయేట్టుగా తయారు చేసుకున్నారు.

కాని, ఆ యజమాని భార్య వచ్చి వాళ్లను కదిలించకపోయినట్లయితే, వాళ్ళు, దాన్ని ఇంకా చక్కగా తయారు చేసి వుండేవారు! వంటఇంట్లోకి వచ్చి రావటంతోటే ఆమె నానా శాపాలూ అనేక భాషల్లో కచాపచాగా కూయటం మొదలెట్టింది

ఆ ప్రహారాన్ని ఆపటానికి పెపే ఏమీ చెయ్యలేక, మూర్ఛిల్లినంత పనై, చేత్తో గుండెమీద ఒత్తుకుంటూ, చేతులమధ్య తలనొక్కుకుంటూ, బిగ్గరగా నిట్టూర్పు విడిచాడు. కాని, యజమాని రంగంమీదికి వచ్చిందాకా, ఆమె చల్లబడనే లేదు.

"ఏం జరిగింది?" అని యజమాని అడిగాడు.

దానిమీద పెపే జవాబు చెప్పాడు:

"అయ్యా, మీ అమ్మగారు చేసిన అల్లరి చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. నిజానికి, నీకోసం, నేను ఎన్నో తిట్లు పడ్డాను. నాకు తెలిసినంతవరకు, ఆమె – మేము

"నువ్వు మతిలేకుండా మాట్లాడుతున్నావ్" అని అప్ప అతనికి అడ్డు చెప్పింది. కాని పెపే ఆమె నీతి నియమాలను జయించగలిగాడు. ఆమె, తెలబూడిదరంగులోవున్న మంచి లాగు ఒకటి పట్టుకొచ్చింది. అది పెపేకు చాలాపెద్దదే. అయినా దాన్ని ఎలా సరిచేసుకోవాలో అతనికి తెలుసు.

"కత్తెర తెచ్చిపెట్టు!"

ఇద్దరూ కలిసి, దాన్ని, పెపేకు సరిపోయేట్టుగా తయారు చేసుకున్నారు.

కాని, ఆ యజమాని భార్య వచ్చి వాళ్లను కదిలించక పోయినట్లయితే, వాళ్ళు, దాన్ని ఇంకా చక్కగా తయారు చేసి వుంచారు! వంటఇంట్లోకి వచ్చి రావటంతోటే ఆమె నానా కూతలూ అనేక భాషల్లో కచాపచాగా కూయటం మొదలెట్టింది

ఆ పరిహాసాన్ని ఆపటానికి పెపే ఏమీ చెయ్యలేక, మూర్ఛిల్లినంత పని, చేత్తో గుండెమీద ఒత్తుకుంటూ, చేతులమధ్య తలనొక్కుకుంటూ, బిగ్గరగా నిట్టూర్పు విడిచాడు. కాని, యజమాని రంగంమీదికి వచ్చిందాకా, ఆమె చల్లబడనే లేదు.

"ఏం జరిగింది?" అని యజమాని అడిగాడు.

దానిమీద పెపే జవాబు చెప్పాడు:

"అయ్యా, మీ అమ్మగారు చేసిన అల్లరి చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. నిజానికి, నీకోసం, నేను ఎన్నో పాట్లు పడ్డాను. నాకు తెలిసినంతవరకు, ఆమె - మేము

చేసా - మనుకుంటున్న దనుకుంటాను. కాని,
దు. నమ్మండి. ఇది నాకు సరీగ్గా సరిపోతుంది!
నేను కాజేసాననీ, నువ్వు మళ్ళీ ఇంకొకటి
లేవనీ ఆమె అభిప్రాయంలా వుంది...."

ఇదంతా, ఏమీ చలించకుండా, వింటున్న యజ
మాని చివర కన్నాడు.

"సరే, అయితే నేను పోలీసుల్ని పిలిపించా లను
కుంటున్నాను."

"నిజంగానా? ఎందుకు?" అని ఆశ్చర్యంతో అడి
గాడు పెపే.

"నిన్ను జైలుకు పట్టుకెళ్ళటానికి...."

పెపే చాలా నొచ్చుకున్నాడు. నిజంగా అతనికి ఏడు
పొస్తున్నది. కాని గుడ్లనీళ్ళు గుడ్లకుక్కుకుని, హుందాగా
అన్నాడు:

"మనుషుల్ని జైళ్ళకుపంపటం నీకు సరదా అయితే,
అది నీయిష్టం! కాని, నాదగ్గర చాలా లాగులుండి, నీదగ్గిర
ఒక్కటీ లేకపోయినట్టయితే, నేనుమాత్రం నిన్ను జైలుకు
పంపించను! నీకు రెండో మూడోలాగులు ఇచ్చేవాణ్ణి -
రెండూ మూడూ ఒకేసారి కట్టుకోటం సాధ్యం కాకపోయి
నప్పటికీ! అదీ, ముఖ్యంగా ఈ ఎండలరోజుల్లో..."

ధనవంతులు కూడా ఒకొక్కప్పుడు హాస్యం అర్థం
చేసుకోగలరు గనుక, ఆయజమాని విరగబడి నవ్వటం ప్రారం
భించాడు. తర్వాత పెపేకు ఒక చాక్‌లెట్ ఇచ్చి, ఓ అణా

చేతులో పెట్టాడు. అది తీసుకుంటూ "నమస్కా
అనుకుంటాను" అన్నాడు పెపే.

కాని, అన్నిటికంటే, అసలు నిజంగా క
లంటే, అతను ఒంటరిగా ఆగుట్టలమీద ఉన్న
గుట్టల చరిత్రంతా పరిశోధిస్తున్నవాడిలాగా, ప్రతి
పరీక్షగా చూస్తూవుంటాడు. అలాంటి సమయాల్లో
విప్పారి, ఏదో ఆశ్చర్యం పొంగిపొర్లుతున్నట్లుంటాయి. చేతు
వెనక్కి పెట్టుకొని, తలా నడుమూ ముందుకువంచి; గాలిలో
పూవులాగా అటూ ఇటూ కొంచెం ఊగుతూ, అలా దీక్షగా
చూస్తూంటాడు. లో గొంతులో ఎల్లప్పుడూ ఏదో సంగీతం
పాడుతూనే వుంటాడు.

గోడలమీద ఊదా కాంతులు విరజిమ్మే 'విస్టేరియా'
పూలను పరిశీలించేటప్పుడు కూడా అతన్ని చూడవచ్చు. సము
ద్రపు గాలికి సంచలించే, ఆ పూల రేకుల కదలికను వింటు
న్నాడేమో అన్నట్లు ఫిడేలు తీగెలాగా, నిట్టనిలువుగా సాగి నిల
బడతాడు. అలాచూస్తూ, "ఫియోరినో... ఫియోరినో..."
అని పాడుకుంటూ వుంటాడు.

దూరంనుంచి, ఓ పెద్ద మద్దెలమోత లాగా, సముద్ర
నిశ్వాసం వినవడుతూ వుంటుంది. పూలమీద సీతాకోక చిలు
కలు ఒకదాన్నొకటి వెంటాడుతూవుంటాయి. పెపే వాటిని
చూసి, తలెత్తి, ఎండకు కళ్ళు చిట్లిస్తూ, సెలవివార నవ్వుతూ
వాటిపరుగు పరికిస్తుంటాడు. ఆనవ్వులో అసూయా విషాదాలు
మిళితమై వున్నప్పటికీ, ఈ భూమిమీద ఎవరో మహాను
భావుడు వుండాగా నవ్వినట్లుంటుంది.

ఓ పచ్చటి బల్లిని భయపెట్టటానికి చప్పట్లు కొడుతూ, "హోయ్! హోయ్" అని అరుస్తుంటాడు.

సముద్రం అద్దంలాగా నిశ్చలంగా వున్నప్పుడు, కెరటాలు కొట్టిన నురుసంతా ఎండిపోయి ఆగుట్టలు శుభ్రంగా వున్నప్పుడు, అతను సముద్రపుఒడ్డున ఒకరాతిమీద కూర్చొని, ఆ స్వచ్ఛమైన నీటిలోకి తన మెరిసే కళ్లతో చూస్తూ-ఆలోపల ఎర్రటి నీటి మొక్కలమధ్య దూసుకుపోయే చేపల్నీ, ముందుకూ వెనక్కూ కదిలే సముద్రపు తాబేళ్ళనూ, పక్కలకు పరుగెత్తే ఎండ్రకాయలనూ - కనిపెట్టుకుని వుంటాడు.

ఆ ప్రశాంత వాతావరణంలో అతనిపాట ఆ నీలాల నీటి మీదికి పయనిస్తూ వుంటుంది.

"కడలి!

ఓహో, కడలి..."

పెద్దవాళ్ళు పెపే వంక చూచినప్పుడు, తరచుగా అసంతృప్తితో తల తిప్పుతూ, అంటారు:

"వీడు అరాజకవాది అవుతా" డని.

ఇంకా ఎక్కువ పరిశీలనాదృష్టికలవాళ్లూ దయగలవాళ్లూ అతన్ని గురించి మరో అభిప్రాయం వెలిబుచ్చుతారు:

"పెపే మనకవి అవుతాడు!" అని.

మరి, పెట్రెలుచేసే పాస్క్వాలినో, వెండిపోతపోసినట్లు ఆ తలా, శిలావిగ్రహం చెక్కినట్లు ఆముఖమూ - అతను, వృద్ధుడు - తెలివితేటలూ, గౌరవ మర్యాదలూగల పాస్క్వాలినోకు వేరే అభిప్రాయం వుంది.

"మనబిడ్డలు మనకంటే బాగుపడతారు! వాళ్ళ బ్రతుకులుకూడా మన బ్రతుకులకంటే బాగుపడతాయి!" అని.

అతని మాటమీద చాలామందికి నమ్మకం వుంది.

---

ఎండు మోళ్ళపై చిగుర్పు
వసంత నవ క్రాంతి రేఖ
గతం ప్రస్తుతం కానిది
భవిష్యత్తులో వున్నది!



111

# పల్లెపట్టు
# ఇతర కథలు

* చెకోవ్ *

అనువాదం : ప్రయాగ

పల్లెటి జీవితం ఎంత అమాయకత్వంతోను, అజ్ఞానంతోను, దాస్యంతోను, దారిద్ర్యంతోను సంక్షుభితమైపోతున్నదో చెకోవ్ వాస్తవిక కథాశిల్పం, బొమ్మకట్టి, చూపుతుంది. నిత్యం శ్రమించి, తమ రక్తస్వేదాలతో దేశీయ సంపత్తిని పెంపొందించే రైతులు, నాగరికతాసంస్కృతులకు దూరం చేయబడి, ఆటవికుల్లాగా ఎలా జీవిస్తున్నారో – పల్లెపట్టు, ఇతర కథలు అద్భుతంగా నిరూపిస్తాయి.

మాక్సిం గోర్కీ వ్రాసిన 'చెకోవ్ జీవితచిత్రం' కూడా ఈ పుస్తకంలో ప్రచురించబడింది. ప్రతి ఒక్కరూ చదువదగిన ఉత్తమ కథా సంపుటి.

వెల : రూపాయి.

ప్రతులకు :

**లీలా బుక్ డిపో,**

విజయవాడ, 2.

# త్రిలింగ ప్రచురణలు

## శాస్త్రీయ గ్రంథాలు:

| | | | | |
|---|---|---|---|---|
| సోషలిజం: ఊహాజనితం, శాస్త్రీయం | (ఏంగెల్సు) | 1 | 4 | 0 |
| ఆస్తి: దానిపరిణామం | (పాల్‌లెఫార్గ్) | 1 | 12 | 0 |
| పెట్టుబడిదారీవిధానం: దానిపరిణామం | (హ్యూబర్‌మన్) | 1 | 8 | 0 |
| వలసదేశాలలో, అర్ధస్వతంత్ర వలసదేశాలలో విప్లవోద్యమం | ... | 1 | 4 | 0 |
| విలువ: ఖరీదు: లాభం | (కారల్‌మార్క్స్) | 0 | 12 | 0 |
| కూలి: పని: పెట్టుబడి | (కారల్‌మార్క్స్) | 0 | 12 | 0 |
| కారల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగెల్స్ | (లెనిన్) | 0 | 12 | 0 |
| గతితార్కిక చారిత్రక భౌతికవాదం | (స్టాలిన్) | 0 | 4 | 0 |
| రాజ్యాంగ యంత్రం: విప్లవం | ... | 0 | 4 | 0 |
| మహాసభ - తీర్మానాలు | ... | 1 | 0 | 0 |
| లెనినిజం: పద్ధతి, సిద్ధాంతం | ... | 0 | 8 | 0 |

## సాహిత్య గ్రంథాలు:

| | | | | |
|---|---|---|---|---|
| రష్యన్‌సమస్య, నాటకం | (సిమనోవ్) | 1 | 8 | 0 |
| శిలాసింహం, నాటకం | (ఇల్యాఎహ్రెన్‌బర్గ్) | 1 | 4 | 0 |
| ఇటలీ కథలు | (మాక్సింగోర్కీ) | 1 | 0 | 0 |
| పల్లెపట్టు - ఇతరకథలు | (చెకోవ్) | 1 | 0 | 0 |

## అచ్చులో ఉన్నది:

కుటుంబం: దాని పుట్టుపూర్వోత్తరాలు (ఏంగెల్సు)

**ప్రతులకు: లీలాబుక్‌డిపో, విజయవాడ - 2**

114

A Trilinga Publication No. 1…

"Tales of Italy"
By Maxim Gorky



Telugu Rendering
By Prayaga

## మాక్సిం గోర్కీ
[1868 1936]

"రచయిత అయిన గోర్కీలో ఒక విశిష్ట గుణం వుంది. ... ఆ గుణమే ఆయనకు, ఆయన జీవించి వుండగానే అమరత్వం ప్రసాదించింది. తన ప్రజలతో తాను పూర్తిగా ఖచితంగా ఒక్కటై పోవటమనేదే ఆ విశిష్ట గుణం. ప్రపంచంలోని మరే జాతి కూడా, ఆ జాతినుంచి, జాతి యొక్క స్థాయితో పరిసమానంగా పెంపొందిన వ్యక్తిని చూడటానికి నోచుకోలేదు. గతాన్నీ, భవిష్యత్తునూ - శతాబ్దాల గత చరిత్రనూ, కొత్తకొత్తగా రేకెత్తే జీవితాశలనూ - ఆ ముదుసలి చేతుల్లో పట్టుకొని గోర్కీ ఒక్కడే అలాంటి మహావ్యక్తి ఔతాడు. పురాతన రష్యన్ సాహిత్య ప్రపంచాన్నంతటినీ, ఆ పురాతన జానపదగీతాల్లోని ప్రజలనూ, ప్రపంచాన్నీ కూడా, గోర్కీ, తనతో పాటు చారిత్రక మహా ప్రస్థానంలోకి తీసుకొచ్చాడు......

"...ఆయన జీవితం కడపటిరోజుల్లో, ఆ చిటపటలాడే జూన్ మాసపు ఎండల్లో, ప్రభుత్వం ఆయనకిచ్చిన పార్కులోని భవన ద్వారం చేరుకున్నాం.... కేవలం ప్రతికూలవార్త వచ్చింది ... అది మామూలుచావు కాదు; చాలా విషాదకరమైన ఘటన ... ఆ డాక్టరుతో సహా, కుట్రచేసారు; నీచాతినీచమైన ఘోరమైన కుట్ర. కసాయితనం - గోర్కీ చనిపోయాడు. దేశమంతటా ఒక పెద్ద నిట్టూర్పుపొగలు క్రక్కింది. చుట్టూ పూలతోను, వాడి ఏడుస్తున్న మొక్కలతోను కప్పబడి, నిద్రించే గోర్కీని నేను చూసాను.—

"... ఎన్నడూ ఎక్కడా ఏ ప్రజలూ పడని బాధలకు గురైన తన ప్రజలమధ్య ఆయన జీవించాడు...ఆయనే మనన్ని ప్రశ్నిస్తున్నాడు—
'మీరెవరిపక్షం నిలుస్తా ?' రని
ప్రజలపక్షమా ? ప్రభువుల పక్షమా ?—"

— ఫ్రెంచి మహాకవి, అరగాన్

Wrapper Printed at Kavitilaka Press, Vijayawada.

115

| MaNaSu Foundation |
|---|
| Check List |

| | |
|---|---|
| Book Number | CP03C113 |
| Condition | |
| Front Cover | yes |
| Back Cover | yes |
| Blank Pages | CI, 113 |
| Missing Pages | |
| Others | |
| Remarks | |